# శ్రీ గీతగోవిందము

శ్రీ జయదేవకవి విరచితము

# గీతశంకరము

పంచరత్నకవి

అనంతనారాయణకవి కృతము

సంపాదన

సంగీతరచన

శ్రీ మంచాల జగన్నాథరావు

ఆకాశవాణి, హైదరాబాదు.




తొలిపలుకు

వాఙ్మయ మహోధ్యాతః

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు

లైబ్రరీ అండ్ రీసర్చి ఇనిస్టిట్యూట్

( State Archives )

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

# తొలిపలుకు

ప్రసిద్ధాప్రసిద్ధాలైన రెండు సంస్కృత యక్షగానకావ్యాల సంపుటం యిది. తొలిది శ్రీ జయదేవకవి విరచితమై వివిధదేశ భాషాలిపులలో ప్రచురితమై విస్తృత వ్యాప్తినొందిన శ్రీ గీతగోవిందం–రెండవది పంచరత్నకవి అనంతనారాయణుడు రచియింపగా అముద్రితమై తంజావూరు సరస్వతీ మహలులో నివురుగప్పిన నిప్పువలె–ధూళి ధూసరితమైన రత్నంవలె–మేఘుచ్ఛన్నమైన సూర్యునివలె ఉన్న "గీత శంకరం"–

శ్రీ జయదేవుని సుకృతి భారతదేశంలో వివిధ రాష్ట్రాలలో ముద్రితమై విస్తృత ప్రచారం పొందినా తిరిగి దీనిని అముద్రిత గీతశంకరంతో పాటు ప్రచురించడంలో ఒక వైశిష్ట్యం ఉన్నది. శ్రీ గీతగోవిందంలోని శ్లోకాలను అష్టపదులను అనేకమంది రసజ్ఞులు–రసపిపాసువులు–పాడుకొనడం కద్దు– వివిధ రాగలయ తాళాలతో హరికథలవలె నృత్తగానాలతో తెలుగు తాత్పర్యాలతో కొలదిరోజులలో మొత్తం కృతిని రససంప్లావితంగా చెప్పేవారూవున్నారు ఇంతగా సంగీత సమ్మిళత మైన శ్రీ గీతగోవింద కృతిని గీతశంకరంతోపాటు స్వరసంవలితమైన రాగతాళాత్మకాలుగా సార్థకగాన కావ్యాలుగా ప్రకటించడమే యీ ప్రచురణ వైశిష్ట్యం.

తెలుగురచనలలో యక్షగాననాటకాలు ప్రాచుర్యం పొందినంతగా యక్షగాన కావ్యాలు పొందలేదు శ్రీ గీతగోవిందాది కృతులవలెనే తెలుగులో త్యాగరాజాదులు సీతారామవిజయం, నౌకాచరిత్ర, ప్రహ్లాదభక్తివిజయం మొదలైన యక్షగాన కావ్యాలు విరచించారు. తెలుగులో యక్షగాననాటకాలు బహుళప్రచారంలోకి వచ్చిన తరువాత నాటకభిన్నమై యక్షగాన కావ్యరూప ప్రక్రియాత్మకమైన రచన ఉన్నదన్న విషయాన్ని దేశం దాదాపు విస్మరించిందనే చెప్పవచ్చు. కారణం దృశ్య వినోదసంకలితమైన "నాటక"దర్శనాలోలుపత్వమే.

యక్షగాన కావ్య–నాటక–రచనా ప్రక్రియ కేవలాంధ్రదేశీయమైనదని యిటీవలివరకూ విమర్శకులు–సాహిత్యవేత్తలు భావించారు అయితే శ్రీ శాహజీవిరచితమైన సీతాకల్యాణము తెలుగు యక్షగాన నాటకానికి నేను రచియించిన తొలిపలుకులో పేర్కొన్నట్లు "యక్షగానకావ్య" రచనా ప్రక్రియ తొలుత సంస్కృతంలో ప్రాదుర్భవమైనదే. వృత్త–పదాత్మకమై విశిష్ట విభిన్నశాఖగా భావింపబడడానికి అతిపూర్వకాలంలోనే సంస్కృతంలో గానాత్మక కావ్యాలవతరించాయి.

## సంస్కృత యక్షగాన కావ్యాలు

అసలు సంస్కృతంలో తొట్టతొలి యక్షగాన కావ్య మనడానికి సమర్థమైన సుకృతి వాల్మీకి కృత రామాయణం–యక్షగాన కావ్యమంటే యక్షులు గానం చేసినట్లు గానం చెయ్యబడే కావ్యం అని అర్థం గానం గంధర్వమూలకం – యక్షుల

కంటే గానంలో అత్యధికులు గంధర్వులుగదా! యక్షగానం కంటే గంధర్వగానం ఉత్కృష్టమైనదనడంలో సందేహం లేదు. గంధర్వగాన ప్రజ్ఞాసమన్వితమై పాడడానికి యోగ్యంగా రచించబడిన రామాయణం యక్షగాన కావ్యంగా భావింపబడడంలో పొరపాటుండదు వాల్మీకి రామాయణాన్ని గతంలో యక్షగానంగా యెవరూ గుర్తించకపోయినా గానకావ్యంగా కొందరు గుర్తించకపోలేదు రామాయణం బహుశాస్త్రగ్రంథం-ఆర్ష పద్ధతికి భిన్నంగా సవ్యగ్రంథమై అవతరించిన వ్యాస మహాభారతాన్నే అనేక శాస్త్ర గ్రంథాలకు ప్రతిబింబంగా కాదు-అసలు శాస్త్రసముచ్చయ స్వరూపంగానే ప్రాచీనులు భావింపగా వచ్చి ఆర్ష పద్ధతిలో అపసవ్య గ్రంథమై అవతరించిన వాల్మీకి రామాయణాన్ని లక్షలక్షణమహితమైన బహుశాస్త్రగ్రంథంగా భావించడంలో అనౌచిత్యం యేముంటుంది? వాల్మీకి అసలు తన రామాయణాన్ని షట్శాస్త్ర సమ్మతంగానేకాదు-షట్శాస్త్ర సమ్మితంగా కూడా రచించాడు ఈ రహస్యాన్ని యింతవరకూ సరిగా యెవరూ గుర్తించినట్లు కనపడదు సమ్మితమంటే కూడింది అనే యిక్కడ అర్థం కాగా రామాయణానికి కావ్యపరమైన కథాసంకలితమైన అర్థమేకాక షట్శాస్త్రాలపరంగా ఆరు అర్థాలు కూడా వస్తాయన్నమాట. శాస్త్రీయాలైన యీ షడర్థాలూ వ్రాయాలంటే అసలు సరైన వాల్మీకి రామాయణాన్ని పునస్సంస్కారాలతో సంకలనాలతో సంపాదించి ప్రచురించవలసిన ఆవశ్యకత యెంతైనా ఉంటుంది. తర్క-ధర్మ-వైద్య-జ్యోతిష-వ్యాకరణ-గంధర్వ వేదార్థాలు౦ వాల్మీకి రామాయణానికున్నాయి*. సంగీత పరంగా శాస్త్రీయత ఉన్నట్లు విస్పష్టంగా అర్థమవుతున్నది.

> పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్ ।
> జాతిభి స్సప్త ర్బద్ధంతంత్రీలయ సమన్వితమ్ ॥
> హాస్య శృంగార కారుణ్యరౌద్ర వీరభయానకైః
> భీభత్సాద్భుత సంయుక్తం కావ్యమే తదగాయతామ్ ॥
>
> తౌతు గాంధర్వతత్వజ్ఞౌ
> మూర్ఛనా స్థాన కోవిదౌ
> భ్రాతరౌ స్వర సంపన్నౌ
> గంధర్వావివరూపిణౌ ॥

అని వాల్మీకి స్వయంగానే పేర్కొన్నాడు అసలు రామాయణ రచనకే మూలంగా యాదృచ్ఛికంగా అవతరించిన "మానిషాద" ఇత్యాది శ్లోకంకూడా "పాదబద్ధోఽక్షర సమస్తంత్రీలయ సమన్వితమ్" అని గాన యోగ్యమై అవతరించినట్లే వాల్మీకి స్పష్ట పరచాడు రామాయణమంతా మామూలుగా పఠించడానికి యోగ్యమైనది-అంతే కాదు. మధురంగా పాడడంలో త్రివిధాలైన ప్రమాణాలతోను లయసమన్వితమై స, రి, గ, మ, ప, ధ, ని, స అన్న సప్త జాతులతో బద్ధమై పాడడానికి యోగ్యం

---

* స్థలవిస్తర భీతిచేత మిగిలిన శాస్త్రీయ విషయ నిరూపణం మానివేసి ఒక సంగీతపరమైన (యక్షగాన కావ్య ప్రతిపత్తికై) విషయాలే యిక్కడ ప్రతిపాద్యాలవుతున్నాయి.

గానే రచించబడింది శబ్ద-అర్థ-రాగ ప్రమాణాలతో-వేద-ధర్మ-పురాణ ప్రమాణా
లతో-తర్క-యోగ-వేదాంత ప్రమాణాలతో కూడి ఉన్నదట రామాయణం-మరి
రామాయణమంతా ఒకే రాగంలో ఒకే తాళంతో ఒకే విధమైన లయతో పాడ
డానికి వీలుగా రచించబడిందా అంటే కాదని స్పష్టంగా అర్థమవుతున్నది హాస్యాది
వివిధ రసాలతో నిండివున్న యీ కావ్యం గానయోగ్యమంటే ఒకే రాగంలోనని
యెలా చెప్పగలం? ఏ రసఘట్టం వచ్చినా ఒకే రాగంలో గానం చెయ్యాలని
సామాన్య సంగీతజ్ఞుడే కాదు-కేవల శ్రోతయైనవాడు కూడా భావించడుగదా! -
రసానుగుణంగా భావానుగుణంగా వివిధ రాగ తాళాలతో గానం చెయ్యాలన్నదే
వాల్మీకి భావం-సప్తస్వరాల ఆరోహణ అవరోహణలకు మూర్ఛన అని పేరు-షడ్జ-
మధ్యమ-గాంధార గ్రామాలకు మూడింటికి సప్తమూర్ఛనలవంతున లెక్కిస్తే 21
మూర్ఛనలు యేర్పడతాయి. ప్రస్తుత వ్యవహారంలో చతుర్దశ మూర్ఛనలే
గాంధర్వ రహితాలై ఉన్నా వాల్మీకి కాలంలో కూడా యివి మాత్రమే వ్యవహృ
తాలయ్యాయని చెప్పడానికి అవకాశం లేదుగదా! గాంధర్వ తత్వజ్ఞులు వివిధ
మూర్ఛనా స్థానకోవిదులూ అయిన కుశలవులు ఒకే ఒక రాగతాళలయలతో
రామాయణమంతా గానం చేశారని చెప్పలేము గదా! మహాశాస్త్రజ్ఞుడై త్రికాలజ్ఞు
డైన మహర్షి గంధర్వ వేదతత్వజ్ఞుడైన రసజ్ఞ మహర్షి మహాకవి వాల్మీకి ఏకైక
రాగతాళ లయబద్ధంగా రామాయణ కావ్యాన్ని రచించి ఉంటాడనడానికి అవ
కాశం బొత్తిగాలేదు. మనం ముఖ్యంగా గుర్తించవలసింది మరొక విషయం
వున్నది-రామాయణం షట్శాస్త్ర సమ్మితం అనుకున్నాము శాస్త్రీయమైన గ్రంథం
యేదైనా కేవల లక్షణబద్ధమై మాత్రమే ఉండదు. లక్ష్యబద్ధంకూడా అయితీరుతుంది.
[కొన్ని కొన్ని సందర్భాలలో అర్వాచీనులు పూర్తిగా యీ పద్ధతిని పాటించక
పోవచ్చు-] కాగా వాల్మీకి రామాయణం గాంధర్వ (సంగీత) లక్షణ గ్రంథమేకాక
లక్ష్యసంబద్ధమైన లక్షణ గ్రంథమన్నమాట-మరి లవకుశులు రామాయణాన్ని
యెన్నెన్ని రాగ, లయ, తాళాలతో గానం చేశారో స్వయంగా కర్తయైన వాల్మీకి
వారికెన్ని రాగాలు నేర్పాడో చెప్పలేముగదా. అసలు రామాయణాన్ని యక్ష
గంధర్వ కిన్నరకింపురుషులే గానం చేశారంటే యెన్నెన్ని రాగాలతో యెంతెంత
మధురాతిమధురంగా యెన్ని విధాలుగా గానం చేశారని చెప్పగలం?

కాగా వాల్మీకి రామాయణం కిన్నర గానకావ్యం-కింపురుష గానకావ్యం-
గంధర్వ గానకావ్యం-యక్షగానకావ్యం అనడంలో అనౌచిత్యం లేదు. *రామా
యణం తరువాత కావ్యాలు వ్రాసినవారు వాల్మీకివంటి మహర్షి మహాకవులూ
కారు-వాల్మీకివంటి బహుళ శాస్త్రజ్ఞులూకారు-వాల్మీకివంటి బ్రహ్మజ్ఞులూకారు.
కాబట్టే వాల్మీకి రామాయణానికి దీటురాగల కావ్యాన్ని-వాల్మీకి మహాకవి
పేర్కొన్నట్లు "పాఠ్యే గేయేచ మధురం ప్రమాణైస్త్రిభిరన్వితం-జాతిభిస్సప్తభిర్బద్ధం
తంత్రీలయ సమన్వితమ్" కాగల కావ్యాన్ని మరొకదాన్ని ఇతరులెవరూ సృష్టించ
లేకపోయారు వ్యాసమహాభారతం బహుశాస్త్ర సమ్మతమైనా గాంధర్వ (సంగీత)
సమ్మతం-సమ్మితం- గా అవతరించనే లేదు-ఇతర రచనల గురించి చెప్పేదేముంది?

---

* "గంధర్వ యక్షవిద్యాధరాదులై పాడెడునాడెడువారు" అని పాల్కురికి సోమన
పేర్కొనడంలో ఆంతర్యం యిదే.

# శ్రీ జయదేవ కృతి

లభ్యంకాని అనంతకావ్యవాఙ్మయంలో యక్షగానంగా గాని మరోవిధంగా గాని గానం చెయ్యడానికి వీలైన కావ్యాలు యెన్ని అవతరించి మరుగునపడి వున్నాయో చెప్పలేముగాని లభ్యమైన వాటిల్లో శ్రీ జయదేవకవి ప్రణీతమైన శ్రీ గీతగోవిందం సంస్కృతంలో అవతరించిన యక్షగాన కావ్యం-సంస్కృత కవి పండితులుగాని విమర్శకులుగాని గీతగోవిందాన్ని యక్షగానంగా పేర్కొనలేదు-వివిధ వృత్త గీతాలతో ఉన్న యీ యక్షగాన కావ్యం సర్గలుగా విభజింపబడిఉన్నా (యక్ష) గానకావ్యంగానే వ్యవహరింపబడుతున్నది -అయితే సంగీతజ్ఞులైన వారు శ్రీ గీతగోవిందంవంటి వాటిని యక్షగాన కావ్యాలుగా వ్యవహరించడం ఉన్నది-తెలుగు యక్షగాన కావ్యాలలో పద్యాలతోపాటు వివిధ కీర్తనలు-ధ్రువాలు-ధవళాలు- పదాలు విరచించబడే పద్ధతిలోనే శ్రీ గీతగోవిందం సంస్కృతంలో రచించబడింది.

శ్రీ గీతగోవిందంలో వివిధ శ్లోకాలతోపాటు అక్కడక్కడా మొదట ఒక "ధవళం", పిదప "మంగళం"-అనంతరం "భ్రమరపదం"-రెండు గీతికలు-పదిహేడు ధ్రువాలు రచింపబడ్డాయి-మాత్రాచ్ఛందోబద్ధాలైన యీ ధవళ-భ్రమర-ధ్రువ-గీతికాదులన్నీ తెలుగు యక్షగానాలలోవలెనే వివిధ రాగతాళ యుక్తాలుగా రచియింపబడ్డాయి-ఈ శ్రీ గీతగోవిందం సుప్రసిద్ధమే అయినా యిది సంస్కృతంలో పూర్వమే అవతరించిన-తెలుగు యక్షగాన కావ్యంవంటి యక్షగాన కావ్యమని మనవారు గుర్తించకపోవడం ఆశ్చర్యకరంగానేవున్నది. దీని ప్రణీత శ్రీ జయదేవకవి. 12 సర్గలున్న యీ కృతిలో తొలిపది సర్గలలోనూ రాధాకృష్ణుల విప్రలంభ శృంగారమూ పదకొండు-పన్నిండు సర్గలలో సంభోగ శృంగారమూ సాంగంగా వర్ణించబడ్డాయి మానుషామానుషశృంగార రసభావాభివర్ణితమై అవతరించిన యీ మధుర కృతికి అనేకమంది వ్యాఖ్యలు రచించారు రసికప్రియ-రసమంజరి-వ్యాఖ్యలు ప్రసిద్ధాలు. తిరుమలదేవరాయలు రచించిన "శ్రుతిరంజని" వ్యాఖ్య కూడా ఉన్నది.

ఈ శ్రీ గీతగోవిందకృతిని తెలుగులో అనేకమంది రసలోలుపత్వంతో అనువదించారు కొన్ని సంవత్సరాలక్రిందట శ్రీ యం ఆర్. అప్పారావుగారి కోరికపై "జయదేవకృతి"అన్న పేరుతో నేను మొత్తం పద్యకృతిగానే అనువదించాను ఈ కృతి 1963 లో వెలువడింది అప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయ-సమాచార శాఖామంత్రిగా ఉన్న బహుభాషావేత్తలు—విమర్శకులు—రచయితలు—రసపిపాసకులు-రసికజనవిధేయులు నాకు మిత్రులు అయిన శ్రీ పి. వి. నరసింహారావుగారు నా తెలుగు కవితారచనకు స్వహస్తంలో పీఠికరచించారు. ఆ పీఠికలో శ్రీ జయదేవకవి కవితామృతాస్వాదనం చేసిన శ్రీ నరసింహారావుగారు తత్కవితా వైశిష్ట్యంగురించి తన్మయత్వంతో వ్రాసిన రసగుళికలనదగిన కోమలకాంతిపదావళి—

—"భావసౌకుమార్యము, రసాత్మకత, సర్వజనప్రియత్వము—ఈ మూడు సులక్షణము లొకేచోట కానవచ్చునది కృష్ణ కావ్యమునందే ఆ నల్లనయ్య చరిత్రలో

ఒకవైపు సారళ్యము, మరొకవైపు గాంభీర్యము; ఒకవైపు బాల్యచాపల్యము, మరొకవైపు కఠోరకర్తవ్యనిష్ఠ; —ఇట్టి భిన్న ప్రవృత్తుల కళామయ సమన్వయము సాక్షాత్కరించుచున్నది. అవతారములన్నింటిలోను సమగ్రవ్యక్తిత్వము, సర్వతోముఖ మాహాత్మ్యము కృష్ణునికే చెందినది. ప్రపంచ సాహిత్యములో ఇంతటి రమణీయోదాత్త కావ్యవస్తువు మరొకటి కలదనుట సందేహాస్పదమే.

కాని ఒకమాట. కృష్ణ కావ్యములో-శృంగారఘట్టములలో-రసికలోకమును రససింధువులో ముంచెత్తువారు గోపికలు-కృష్ణుడుకాదు. కృష్ణుడు లీలామానుష విగ్రహుడుమాత్రమే. గోపికల అనన్యప్రేమకాలంబనము మాత్రమే. కృష్ణ చరిత్రకు వన్నెతెచ్చునది గోపికల వ్యక్తిత్వము. గోపికలులేని కృష్ణచరిత్ర ఆత్మలేని కళేబరమేయగును. కృష్ణ పరబ్రహ్మతో వారు సాధించిన తాదాత్మ్యము, అనన్యత్వము అద్వితీయమైనవి. ఉద్ధవుని వంటి బ్రహ్మజ్ఞానిని కూడా విగతగర్వునిగా చేయజాలినవి.

గోపికలకు-తాము కృష్ణునంతగా ప్రేమించుచున్నామని తెలియనే తెలియదు కావున ప్రేమించుచున్నామనే అహంభావము వారిలోలేదు ఎందుకు ప్రేమించుచున్నది అసలే తెలియదు. వారి మనోభావమునకు "ప్రేమ" యను అభిధానమున్నది కూడా వారికి తెలియదు! ఎందుకాప్రేమ? వెన్నలు దొంగిలించినందుకా? ఉట్టిమీది పాలకడవలను బ్రద్దలుకొట్టినందుకా? జలకమాడు వారి చీరలు మాయముచేసి వారి పరువు తీసినందుకా? ఈ చేష్టలలో ప్రేమించ వలసినదేమున్నది? "ఓయమ్మ! నీ కుమారుడు మా యిండ్లను పాలుపెరుగు మననీయడమ్మా! పోయెదమెక్కడకైనను..." అని విసుగుతో అభియోగించు గోపికలు మరుసటిదినమే నందనందను డెప్పుడు తమయిండ్లకు వచ్చునా యని వేయి కండ్లతో నిరీక్షించి రనుట నిస్సందేహము. ఇదెక్కడి విపరీత మనస్తత్త్వము? కృష్ణుని మూలమున గోకులములో పాలుపెరుగెంతవృథా అయియుండెనో! అదంతయు అమ్ముకున్నచో ఆనాటి ధరలచొప్పున ఎంతధనము వచ్చియుండెడిదో! లెక్కలు వేసి చూచినచో ఆర్థికశాస్త్రవేత్తల గుండెలాగిపోకుండునా? శిక్షాస్మృతి పండితులట్టి తుంటరిపిల్లలను సంస్కరణ శిక్షాకేంద్రములలో నుంచుమందురుకాని పంచప్రాణములకన్న మిన్నగా ప్రేమించమందురా? ఇంతటి నిర్హేతుకమైన-బహుశః హేతువిరుద్ధమైన-ప్రేమగాథ ప్రపంచసాహిత్యములో అద్వితీయస్థానము నాక్రమించి మానవజాతి ఉన్నంతవరకు, మానవ హృదయములో వికారక్షమత యనునది శేషించి యున్నంతకాలము, జనమానసములను రసప్లుతమొనర్చుచుండుట యెంత అద్భుతము!

కృష్ణకావ్యమందెన్ని రసములొలికినవి? కృష్ణచరిత్రలో లేని రసమనునది కలదా? వీరరౌద్రాద్భుత భయానకము లున్నవి. శాంతరసమున్నది. హాస్య శృంగారము లుండనే ఉన్నవి. విప్రలంభ కరుణములో తీవ్రతమములుగా నున్నవి. ఇంతటి సమగ్రకావ్యవస్తువులు మరెన్నో లేవనుట నిర్వివాదము.

గోపికల ప్రేమ అనన్య సామాన్యమైనది అది కేవల బుద్ధికందునది కాదనే నా విశ్వాసము. మానవ సంఘమునందెన్నెన్నో సంబంధ బాంధవ్యములు కుదురుచు వచ్చినవి బహుశః అన్నింటిలోను ఏదో ఒక ప్రయోజనమో, ఆపేక్షయో, నైసర్గిక కారణమో మూలభూతముగా కానవగును తల్లిపిల్లల ప్రేమ నిసర్గసిద్ధము దైనందిన వ్యవహారములలో కలుగుచుండు అనురాగము ప్రయోజన సిద్ధము భార్యాభర్తల ప్రేమ భౌతిక, మానసిక సంమిశ్రితమనవచ్చును మిత్రప్రేమలోను ఆయా పరిస్థితులననుసరించి మూలాధారమేదో ఉండియుండును చివరకు భగవంతుని యెడ భక్తుని ప్రేమ కూడా మోక్షప్రాప్త్యపేక్షా సమన్వితమగుటవలన ప్రయోజనాతీత మనుపించుకోదేమో !

కాని గోపికల ప్రేమకు ప్రయోజన మేమనగలము ? ఆపేక్ష యేదని నిర్దేశించగలము ? నైసర్గిక కారణమేమని చూపగలము? అంతేకాక సాధారణముగా కొందరు వ్యక్తులవరకే పరస్పర పరిమితమై, వ్యక్తిగతమై, కాలాధీనమైయుండుటే మానసీయ భావబంధముల స్వభావముగా కానవగును. కాని గోపీకృష్ణుల ప్రేమలో ఈ పరిమితుల కాస్కారమే లేదు గోపికల వెరసి సంఖ్య పదహారువేల నూటయెనిమిది అని అనుశ్రుతముగా తెలియుచున్నను ఆనాటి గోపికల జనాభా లెక్కలు మనకు లభ్యము కానందున గోకులప్రాంతములో నివసించిన గోపికలందరును, రూపవర్ణ వయో వివక్షలేకుండ, నందనందనుని లోకోత్తర ప్రేమలో మునకలు వేయుచు ధన్యజన్ములైరనుటయే యుక్తియుక్తమగును కావున వ్యక్తిపరిమితుల నధిగమించిన ఈ ప్రేమను తెలిసికొనవలెనన్నచో ఒక విశిష్టదృక్పథము కావలెనని నా నమ్మకము ఒకవైపు గోపీకృష్ణుల ప్రేమను అందరికిని అర్థమయ్యే పచ్చి మనోవికారముగా చిత్రించినవారు పలువురున్నారు మీదుమిక్కిలి ఈనాడు అతి కాముకుడైన, స్త్రీలోలుడైన వ్యక్తిని వర్ణింపవలెనన్నచో "గోపాలకృష్ణుడు" అని యాతనిని నుల్లేఖించుట పరిపాటి. మరొకవైపు కృష్ణుని పరమాత్మగాను, గోపికలను జీవాత్మలుగాను, ఆరోపించి కృష్ణచరిత్రనంతటిని ఆధ్యాత్మపరముగా తు-చ తప్పకుండ నిరూపించు వ్యాఖ్యాపటుత్వ సంపన్నులకును కొదువలేదు. పై రెండు వ్యాఖ్యలలో ఏది సత్యమో ఏదసత్యమో తేల్చి చెప్పుజోలికి నేను పోదలచలేదు రెంటికిని క్రియా ప్రతిక్రియాభావము (Action and Reaction) కలదని నా బుద్ధికి తోచుచున్నది ఉభయవ్యాఖ్యలును "అతిసులభీకరణము" (Over simplification) పై ఆధారపడినవనియే నా నమ్మకము.

ప్రేమకు శరీరమే పరమావధియనుట ఎంత అపచారమో ప్రేమ సర్వదా శరీర నిరపేక్షమనుటయు నంతే వాస్తవికమగును రాసక్రీడలో ఒక్కొక్క గోపిక ఒక్కొక్క కృష్ణుడు జతగూడవలసి వచ్చినది మరి ఇన్ని వేలమంది కృష్ణులున్నారని గోపికలు తలంచిరందుమా ? కాదు——ఎవరి తన్మయత్వము వారిదే ఒక గోపిక తానెవ్వరో విస్మరించి తానే కృష్ణుడని నమ్మి తదనుగుణ్యమగు చేష్టల నప్రయత్నముగానే చేయుచు, ఆ చేష్టల సందర్భములో కృష్ణుడైన తాను గోపికగా మారువేషము వేసికొన్నట్లు అనుభూతి పొందెనదట ! ఈ అనుభూతి అస్వాభావికము కాదు దీనిని సమర్థించుటకు ఆధ్యాత్మిక ప్రతీకాధార మవసరములేదు దీనిలో శారీరికాంశ

మున్నది ; శరీరాతీతమైన యంశమున్నది. దీనికి ముక్కు పిరువవలసినపనిలేదు నిక్కి నీల్గవలసిన పనిలేదు. ఒక వ్యక్తిత్వపు అణువణువులో మరొక వ్యక్తిత్వము లీనమగుట యను అనుభూతి సర్వాతీతులైన ప్రేమికులకు సుస్పష్టము, సుగ్రాహ్యము, సులభము.

ఇట్టి అద్భుతప్రేమను వర్ణించి మానవజాతికి మహోపకారము చేసినవారు చిరస్మరణీయులు వ్యాసుడు. సూరదాసు, నందదాసు, చండీదాసు, విద్యాపతి, జయదేవుడు, పోతన, మీరాబాయి, క్షేత్రయ్య మొదలగు అనేకుల ఋణము మానవజాతి తలపై ఆచంద్రార్కముగా నిలిచియుండగలదనుట నిస్సందేహము కృష్ణకావ్యములన్నింటికిని "కోమలకాంతపదావళి" పట్టుగొమ్మ. ఈ సాహిత్యములో ఏ పంక్తి చదివినను ఆ వెన్నదొంగ, ఆ గోపీమనోహరుడు, ఆ లీలామానుష విగ్రహుడు మనశ్చక్షువుల యెదుట సాక్షాత్కరించును "భ్రమరగీతి" లోని గోపికలనూహించినచో మానస మేలకొని మరొక మనోహర భావప్రపంచమున విహరించి పునీతమగును. పరిసరకఠోరసత్యములను నిర్వికారముగా నెదుర్కొను నూతనశక్తి ఉదయించును. మనమేమిచేయుచున్నామో ఎందుకు జీవించుచున్నామో తెలియరాని ఈనాడు జీవితమునకొక పరమ లక్ష్యమును దిద్దితీర్చి, ఒక సమర్థనీయత (Justification) ను ప్రసాదించుటతో ఈ మనోహర భావమే నాకు సర్వదా సర్వథా ఉపకరించుచు వచ్చినది. నావలెనే అనేకుల కుపకరించినదని నా విశ్వాసము.

కృష్ణసాహిత్యములో జయదేవుని "గీతగోవిందము" దానికి దేసాటి ఆంధ్రదేశమున "చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ !" "సావిరహే తవదీనా" మొదలగు అష్టపదులు ఆబాలగోపాలమునకు తెలియును అవి వ్రాసిన దెవ్వరో అందరికి తెలియకున్నను అవిమాత్రము తెలియనివారులేరు. చలన చిత్రములవలన కూడ కొన్ని అష్టపదులు విశేషప్రచారమునకు వచ్చినవి ''*

ఇంతకంటెమిన్నగా-మిన్నులకెక్కునంతగా శ్రీ జయదేవుని కవితగురించి మనం యేమని పేర్కొనగలం ? క్రీస్తుశకం 14వ శతాబ్దిలో వంగదేశంలో విస్తృతకీర్తినార్జించి సాహిత్యదర్పణం రచించిన విశ్వనాధుడు దశమపరిచ్ఛేదంలో వృత్త్యనుప్రాసాలంకారానికి ఉదాహరణంగా శ్రీ గీతగోవిందంలోని "ఉన్మీల న్మధుగంధ" (5 పుట.) ఇత్యాది శ్లోకాన్ని పరిగ్రహించాడంటే యీ కవిరచనా ప్రామాణికత యెంతప్రచారమైనదో యెంతటిదో వేరే చెప్పనవసరంలేదు.

"గోపికలులేని కృష్ణచరిత్ర ఆత్మలేని కళేబరమేయగును కృష్ణపరబ్రహ్మతో వారు సాధించిన తాదాత్మ్యము, అనన్యత్వము అద్వితీయమైనవి.'' అని శ్రీ నరసింహారావుగారు పేర్కొన్నమాటలు సత్యసమ్మతాలు—ఈ గోపికలలో "రాధ" అంతర్లీనయైవున్నది—"రాధ"లో గోపికలు అంతర్గతులైవున్నారు.

---

* ఈ తొలిపలుకుకర్త గీతగోవిందానువాదకృతిగా రచించిన ''జయదేవకృతి'' తెలుగుపద్యకావ్యానికి శ్రీ పి. వి. నరసింహారావుగారు 3-3-1963 న రచియించిన పీఠికనుంచి యీ భాగం సముద్ధృతమైనది.

రాధలేనిదే అసలు గోపికలేలేరు  ఆమె రోమకూపాలనుంచి ఆవిర్భవించిన రాధా ప్రతిరూపాలే గోపికలు  ప్రత్యణురూపాలో అనురూపాలే గోపికలు.

రాధ యెవరు? సామాన్యకాదు-అలౌకికశక్తియుక్తురాలైన అసామాన్య ప్రేమామృతమూర్తి. లక్ష్మీదేవ్యంశతో పరమేశ్వర్యాంశతో సంజనితురాలైన "శ్రీ" స్వరూపిణి. రాధ తొలిజన్మలో శచీదేవి. శచి మహావిష్ణువును ప్రేమించగా కృష్ణావతారకాలంలో తత్ప్రేమ సుమించి ఫలిస్తుందని వరమిస్తాడు  లక్ష్మీపరమైన శ్రీ అంశతో శచి విష్ణువును ప్రేమించింది  అయితే అనంతరం శాపవశాత్తు మానవస్త్రీగా జన్మించినా  అతిలోకశక్తిస్వరూపిణిగా  కన్యకాపరమేశ్వరిగా  గాయత్రీపరమైన "శ్రీ" అంశతో విలసిల్లింది. తేజస్వరూపంలో లీనమైనది ఈ శచి రాధగా అవతరించి మహావిష్ణువును కృష్ణరూపంలో ప్రేమించి తరించింది  శ్రీ రూపమైన లక్ష్మీపరమేశ్వరుల అంశలతో అసాధారణశక్తితో జనించిన "రాధ" శ్రీ స్వరూపిణి  అందువల్లనే శ్రీ జయదేవకవి రాధాప్రేమామృతమైన తన యీ సుకృతికి "శ్రీ గీతగోవిందమ్" అని పేరు పెట్టినట్లు కనిపిస్తున్నది

## శ్రీ గీతగోవిందం

"గీతగోవింద"మని యీ కృతిపేరుగా దేశంలో సుప్రతిష్టమైనది. కాని శ్రీ గీతగోవిందమనే కవి తొలుత పేరు పెట్టినట్లు స్పష్టపడుతున్నది. గోవిందుడు గానం చేయబడినందువల్ల యీ కృతి "గీతగోవిందం"గా పేర్కొనబడిందని విమర్శకులు కావ్యనామసార్థక్యాన్ని వక్కాణించారు  గోవిందుని గానం చేసిన వారెవరో "గీతగోవింద" నామంలో నిర్దిష్టం కాదు  త్రికరణాలలో యేదో ఒక రూపంగా గోవిందుని గానం చేసినవారు రాధ-గోపికలు-లక్ష్మీపరమేశ్వర్యాంశలుకల రాధా, రాధ మూలంగానే రూపుగొన్న గోపికలూ "శ్రీ" స్వరూపిణులు. వారు గోవిందుణ్ని తమ హృదయాల్లో ప్రతిష్టాపించుకొని గానం చేశారు  ఈ గానంలో గాత్రగానం-మూకగానం-హృదయగానం వంటి గానాలెన్నైనా  అంతర్భూతాలే కాగా యీ రహస్యాన్ని గుర్తించిన శ్రీ జయదేవకవి తన కృతికి "రాధాకృత-గోపికాకృత-గీతగోవిందం" అని అర్థం వచ్చేట్లుగానే "శ్రీ గీతగోవిందం" అని పేరు పెట్టినట్లు స్పష్టపడుతున్నది  ద్వాదశసర్గలోని "యద్గాంధర్వ" (47-పుట) ఇత్యాదిశ్లోకంలో

"సానందాః పరిశోధయంతు సుధియ *శ్రీ గీతగోవిందతః*" అని "శ్రీభోజదేవ" ఇత్యాది శ్లోకంలో

"పరాశరాది ప్రియవర్గకంఠే *శ్రీ గీతగోవింద* కవిత్వమస్తు"

అనీ స్పష్టంగా శ్రీ శబ్దంతోసహా "శ్రీ గీతగోవిందం"గా నిబంధించబడింది కాగా అసలు కృతిపేరు "శ్రీ గీతగోవిందం"అని ధ్రువపడుతున్నది. "శ్రీమదాంధ్ర మహాభారత" నామం "ఆంధ్రమహాభారతం-మహాభారతం-భారతంగా సంక్షిప్త నామంతో వ్యవహృతమైనట్లు-స్వారోచిషమనుసంభవమని పెద్దనయే పేరుపెట్టిన కృతి ఆ కృతిరచన పూర్తి కాక పూర్వమే "మనుచరిత్ర"గా సుప్రసిద్ధమై సుప్రతిష్ఠితమైనట్లు

"శ్రీ గీతగోవింద" నామం సంక్షిప్తమై శ్రీ రహితమై "గీతగోవిందం"గా వెలసినట్లు కనిపిస్తున్నది కావ్యాంతర్గ శ్లోకాలలో "శ్రీగీతగోవింద" నామాన్ని ఒకటికి రెండుసార్లు పేర్కొన్న కృతికర్త సర్గాంతర్గ గద్యాలలో "శ్రీ గీతగోవింద" శబ్దాన్నే ప్రయోగించి వుంటాడు అయితే శ్రీ గీతగోవిందాన్ని "గీతగోవిందం"గా భావించి ప్రతులు వ్రాసినవారు గద్యాలలో సైతం శ్రీ రహిత "గీతగోవింద" శబ్దాన్నే వ్రాసివుంటారు-కాగా అసలు పేరు మరుగుపడి "గీతగోవింద" నామం అతివ్యాప్తి నొందినట్లు స్పష్టపడుతున్నది కృతి అంతరార్థాన్ని కృతినామసార్థకతను-కృతికర్త హృదయాన్ని గుర్తించి "గీతగోవింద" నామాన్ని "శ్రీ గీతగోవిందం" గా పునః ప్రతిష్ఠించడం జరిగింది

## శ్రీజయదేవకవి

శ్రీ గీతగోవిందం-గీతగోవిందమైనట్లే "శ్రీ జయదేవ" నామం సైతం "జయదేవ" నామంగా మారినట్లు కనిపిస్తున్నది అనేక అష్టపదులలో చివరి చరణంలో "శ్రీజయదేవ" శబ్దమే ప్రయోగితమై వున్నది "శ్రీజయదేవభణితమిదం భవ"(44-పుట) "శ్రీభోజదేవప్రభవస్యరామాదేవీసుత శ్రీజయదేవకస్య" అని (47-పుట) శ్లోకాల్లో సైతం శ్రీజయదేవశబ్దమే ప్రయుక్తమై వున్నది వాస్తవం పరిశీలిస్తే శ్రీ రహితంగా "జయదేవ" శబ్దాన్ని నామంగా పెట్టివుంటారనడానికి అవకాశం కనపడదు "శ్రీ జయదేవ" శబ్దంచేత శ్రీ ని జయించే-లక్ష్మినిగాని పరమేశ్వరినిగాని జయించే దేవుడు నిర్దేశితుడవుతాడు శ్రీ రహిత "జయదేవ" శబ్దంచేత సామాన్య దృష్టితో "జయించేదేవుడు" నిర్దేశితుడై-మహావిష్ణు-మహేశ్వరులపరంగా మాత్రమేకాక మామూలు జయశక్తిగల ఇంద్రాదులేకాదు మరియే ఇతరదేవత అయినా పరిగృహీతుడవుతాడు కాగా అతిసామాన్య దృష్టిపథంతో "జయదేవ" నామం అతని తల్లిదండ్రులు పెట్టారనవలసివస్తుంది ఇంతతేలికగా భావించినా బహుశఃగా శ్రీ గీతగోవిందంలోనే ప్రయుక్తమైన "శ్రీజయదేవ" శబ్దంలో శ్రీశబ్ద ప్రయోగాన్ని నామభాగంగా పరిగ్రహించకపోతే అన్యథా సమర్థించలేము-స్వోత్కర్షగా తనకై తాను గౌరవసూచకంగా శ్రీశబ్దం చేర్చుకున్నాడనలేము. అందువల్ల "పద్మావతీ చరణాచరణచక్రవర్తి"గా వెలిగిన జయదేవుడు "శ్రీ జయదేవ" నామకుడేననడం అత్యంతసముచితంగా ఉంటుంది అసలు పేరు శ్రీజయదేవుడే అయినా అతని కాలంలోనే శ్రీ రహితంగా నామం సంక్షిప్తమై జయదేవుడుగా వ్యవహృతమైనట్లు కనిపిస్తున్నది శ్రీహర్షుడు హర్షుడైనట్లు-శ్రీకాళహస్తి-కాళహస్తి అయినట్లు శ్రీజయదేవుడు జయదేవుడయ్యాడు. ఈ నామసంక్షిప్తీకరణం సౌలభ్యం పేరుతోనూ కావచ్చు-లేదా శ్రీ సర్వసామాన్యంగా సర్వులకూ గౌరవ సూచకమైనందువల్ల శ్రీ శబ్దనామకులకు తద్గౌరవ సూచకంగా వేరొక శ్రీశబ్దం చేర్చవలసి రావడం కాగా – "శ్రీ శ్రీ జయదేవు" డుగా వ్యవహరించవలసి రావడం – యేదో యెబ్బెట్టుగానూ – పౌనరుక్త్యంగానూ భాసించి తత్రత్ప భావంతో సౌలభ్యం పేరుతో శ్రీశబ్దరాహిత్యంవల్ల జయదేవుడుగా వ్యవహృతం కావచ్చు-నామసంక్షిప్తీకరణ మన్నది లోకంలోకంటే ముందు గృహంలోనే తల్లిదండ్రులవద్దనే బంధువులలోనే జరుగుతుంది పెద్దపేరు పెట్టిన బిడ్డలను పిలవాలంటే పూర్తి పేరుతో పిలవడం సర్వసాధారణంగా జరుగనే జరుగదు. గోపాలకృష్ణుడు-

గోపాలమో కృష్ణుడో-అవుతాడు శివురామప్రసాద్-శివడనో-రాముడనో-ప్రసాద్ అనో పిలవబడతాడు వెంకటరమణ-రమణగా వెలుస్తాడు వెంకుగానో ఈరోజుల్లో అయితే వెంకట్‌గానో నిలుస్తాడు నిత్యసన్నిహితులుగా తరచుగా పిలచే బంధువులు మరీ త్వరగా సౌలభ్యాపేక్షతోనో, ప్రేమతోనో, ముద్దుగానో యీ నామ సంక్షిప్తీకరణకు పూనుకుంటారు ఇదేవిధంగా "శ్రీజయదేవ" నామం "జయదేవ" నామంగా సంగ్రహింపబడినట్లు కనిపిస్తున్నది

గోవర్ధనశ్చశరణో జయదేవఉమాపతిః
కవిరాజశ్చరత్నాని సమితౌ లక్ష్మణస్య చ॥

అని లక్ష్మణసేనమహారాజు సభాగృహద్వారంమీద ఉన్న శిలాశాసనశ్లోకం చూస్తే లోకంలో శ్రీజయదేవుడు జయదేవుడుగా సంగృహీతు డయ్యాడని స్పష్టపడుతుంది శ్రీగీతగోవిందంలోనే కృత్యాదిలోనూ అంతంలోనూ విరళంగా అష్టపదుల్లోనైతం "జయదేవ" శబ్దం ప్రయుక్తమైనది

"ఏతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్"—
"శృణుతదా జయదేవ సరస్వతీమ్"—
"జానీతే జయదేవ ఏవ శరణశ్లాఘ్యో"—
[1. పుట]
"యావచ్ఛృంగారసారం శుభమివ జయదేవస్య వైదగ్ధ్యవాచః"—
(48. పుట)

అని నాలుగుచోట్ల శ్లోకాలలో జయదేవశబ్దం ప్రయుక్తమైనది అష్టపదుల్లో నైతం "వర్ణితం జయదేవకేశ - (12-పుట) భవాతికవి జయదేవే - (20-పుట) కవినృపజయదేవకే - (23-పుట) అని మూడుచోట్ల దృశ్యమానమవుతున్నది 120 సంఖ్యకు పరిమితమైఉన్న శ్లోకాష్టపదుల్లో యీ శ్రీ గీతగోవిందరచనలోనే మొత్తం యిరవై నాలుగుసార్లు "శ్రీజయదేవ" శబ్దం ప్రయుక్తంకాగా "జయదేవ" శబ్దం యేడుసార్లుమాత్రమే ప్రయుక్తమైనది. కాగా నామస్వభావాన్ని సార్థకతను వాస్తవికస్వరూపాలనేకాక ఔచిత్యాన్నినైతం దృష్టిలోపెట్టుకొని కవిపేరు పూర్ణనామంగా "శ్రీజయదేవ" కవిగా పేర్కొనడం జరిగింది.

శ్రీగీతగోవిందంలో మొత్తం 12 సర్గలు-95 వివిధ వృత్తరచనలు-24 అష్టపదులు వున్నాయి. వృత్తాలలో శార్దూలవిక్రీడితం-వసంతతిలకం-ద్రుతవిలంబిత-శిఖరిణి-మాలిని-వంశస్థ-హారిణి మొదలైన వివిధ వృత్తాలు తదితరశ్లోకాలు విరచించబడినాయి "ప్రళయపయోధిజలే" ఇత్యాదిగీతం పల్లవికాక 10 చరణాలతో ఉన్న ధవళమేఅయినా. (1-పుట)-ప్రాచీనకాలంనుంచి ధవళంగానే పేర్కొనబడుతున్నా-అష్టపది కాకపోయినా-అష్టపదిగానే పేర్కొనబడుతున్నది. "శ్రితకమలాకుచమండల" (3-పుట) మంగళమే అయినా పల్లవికాక యెనిమిది చరణాలేవున్నా అష్టపదిగానూ-చందనచర్చిత (6-పుట) పల్లవితోకలిపి మొత్తం యెనిమిది చరణాలున్నా భ్రమరపదంగా పేర్కొనబడినా అష్టపదిగానూ పేర్కొనబడింది అసలు నామందృష్టితో అన్నీ అష్టపదులే అయినా తొలిపల్లవితోకలిపే అష్టపదిత్వం రూపొందినట్లు కనిపిస్తున్నది.

శ్లోకాలకు అష్టపదులకు కృతికర్త యే యే రాగాలను నిర్దిష్టంచేశాడో చెప్పలేముగాని అత్యంతప్రచారంపొందిన యీ రచనలోని అష్టపదులు ప్రత్యేకంగా వివిధ రాగాలలో యిచ్చవచ్చినట్లు చిరకాలంగా ఆలాపన చేయబడుతున్నాయి. సంగీతరచనాకర్తలైన శ్రీ మంచాల జగన్నాథరావుగారిచ్చిన రాగతాళాలతోపాటు భారతదేశంలో గానరూపంగా విస్తృతప్రచారంలో ఉన్న యితర రాగతాళాలను సైతం సంగీతజ్ఞులసౌకర్యార్థం ప్రత్యేకించి పట్టికగా ప్రకటించడం జరుగుతున్నది.

## కృతికర్త—కాలం

రామాంబా భోజదేవుల అనుంగుపుత్రుడుగా యీ అమృతకవి అమరకవి శ్రీ జయదేవుడవతరించినట్లు

> శ్రీ భోజదేవ ప్రభవస్యరామాదేవీసుత శ్రీ జయదేవకస్య
> పరాశరాది ప్రియవర్గకంఠే శ్రీ గీతగోవింద కవిత్వమస్తు॥
> (12 సర్గ-47 పుట)

అని తానై కవి పేర్కొన్నాడు. పరాశరాదులు తన మిత్రులైనట్లు కూడ వక్కాణించాడు.

> పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ (1 పుట-2శ్లో)
> జయతి పద్మావతీ రమణ జయదేవకవి
> భారతీ భణితమతిశాతమ్ (36 పుట)
> ("వదసియదికించిదపి" ఇత్యాద్యష్టపది చివరిచరణానికిది పాఠాంతరంగా కొన్ని ప్రతుల్లో వున్నది.)

అన్న నుడులాధారంగా శ్రీ జయదేవుని అర్ధాంగి పద్మావతిగా భావింపబడుతున్నది.

ఈ శ్రీ జయదేవకవి క్రీస్తుశకం 11 వ శతాబ్దిలో వంగదేశంపాలించిన లక్షణసేనమహారాజు (వల్లాలసేనుని కుమారుడు) ఆస్థానంలో ఉన్నట్లు చరిత్రకారులభిప్రాయపడుతున్నారు

"వాచఃపల్లవయత్యుమాపతిధరః" (1 పుట) ఇత్యాది శ్రీ గీతగోవింద శ్లోకంవల్ల శ్రీ జయదేవకవితోపాటు - ఉమాపతిధరుడు - శరణకవి - గోవర్ధనాచార్యుడు-ధోయీకవి ప్రభృతులు లక్ష్మణసేనుని ఆస్థానంలో కొంతకాలం ఉన్నట్లు తేటపడుతున్నది-అయితే శ్రీ జయదేవకవి ఉత్కళదేశీయుడు. జగన్నాథక్షేత్ర సమీప "కిందుబిల్వ" గ్రామంలో పుట్టిపెరిగాడు కాబట్టి కళింగాంధ్రజాలైన తెలుగు యక్షగానకావ్యాలవలె సంస్కృతంలో యక్షగానకావ్యంగా శ్రీ గీతగోవిందాన్ని రచియించడంలో వైచిత్రిలేదు. క్రీ శ. 11 వ శతాబ్దికే తెలుగులో యక్షగానకృతులు అవతరించాయని సీతాకల్యాణం తొలిపలుకులో పేర్కొన్నాను. యక్షగాన కావ్యరచనకు మూలం సంస్కృతరచనలేనని భావించినా

వచ్చే విప్రతిపత్తి యేమీలేదు-ఈ దృష్ట్యా శ్రీ జయదేవుడు ప్రాచీనసంప్రదాయానుగుణంగానే నైసర్గికంగానే యీ సంస్కృతయక్షగానకావ్యరచనకు దొరకొన్నాడని చెప్పవచ్చును.

శ్రీగీతగోవిందమేకాక యీసత్కవి చంద్రాలోకం-రతిమంజరి-కారకవాదం-తత్త్వచింతామణి అన్న గ్రంథాలనుసైతం విరచించాడు-ప్రసన్నరాఘవనాటకకర్త జయదేవుడని కొందరు భావించారుగాని ఆ జయదేవుడు కౌండిన్యగోత్రుడై సుమిత్రామహాదేవులకు కుమారుడు కాగా వీరభిన్నులుకారన్నమాట. కష్ణదాస నామాంతరమున్న వేరొక జయదేవుడు శృంగారమాధవీయచంపువును రచించాడుగాని శ్రీ జయదేవకవి యీ కవి విభిన్నులే-క్రీ. శ. 15వ శతాబ్దిలో చంద్రదత్త కవి విరచితమైన "భక్తిమాల" అన్న గ్రంథంలో మూడు సర్గలలో (39-40-41) శ్రీ గీతగోవిందకర్తఅయిన యీ శ్రీ జయదేవకవిచరిత్ర అతివిపులంగా వర్ణించబడింది.

## గీతశంకరం

శ్రీ జయదేవుని శ్రీ గీతగోవిందానుకృతులై అవతరించిన కృతులలో గీతగౌరీశ-గీతశంకరాలు రెండు ముఖ్యమైనవి గీతగౌరీశకర్త కవిచక్రవర్తి భానుదత్తుడు—గీతగౌరీశంలో పది సర్గలున్నాయి గీతగోవిందంలో శార్దూలాది వివిధ వృత్తాలున్నట్లే యిందులోనూ ఉన్నాయి అయితే అష్టపదులకుమారుగా యిందులో త్రిపదలున్నాయి రచన లలితమై సరసంగా ఉన్నది. రెండవది ప్రస్తుతం ముద్రితమవుతున్న గీతశంకరకృతి. శ్లోకాష్టపదుల రచనావిషయంలో శ్రీ జయదేవుని శ్రీ గీతగోవిందాన్నే అనుసరించినా యిది అనేక సర్గాత్మకంగా వెలయలేదు 22 శ్లోకాలు 24 అష్టపదులతో అవతరించిన యీ సుకృతి ఏకైక సర్గాత్మకంకాదు సర్గరహితం గీతశంకరం శ్రీ గీతగోవిందమంతటి బృహద్గ్రంథం కాకపోయినా రచనాస్థాయిలో దానితో దీటురాగలదే - లక్ష్మీపరమేశ్వరుల స్వరూపిణి అయిన రాధతో సంకలితమైన కృష్ణప్రేమ విచిత్రమైనది-విశిష్టమైనది-ఆధ్యాత్మికతామయమైనదైనను శృంగారరసైకైక ప్రాణపదమైనది-మరి గౌరీపరమేశ్వరుల ప్రేమ కేవల శృంగారరసైకైక జీవనసంధాయిని కాదు—ఈ ప్రేమలో అర్ధనారీశ్వరుని అపూర్వసృష్టి-స్థితి-లయహేల అంతర్లీనమై ఉన్నది. జగన్మాత జగత్పితలుగా పవిత్ర భక్తిప్రపత్తుల నలవరచగలది — శ్రీ గీతగోవింద-గీతశంకరముల మధ్య శృంగారరసపరంగా యింతటి అంతరమున్నా ఏతత్కృతికర్త పంచరత్నకవి అనంతనారాయణుడు చేయితిరిగిన తన మధురకవితారచనతో పదార్థభావరసగుణాలంకార సంప్లవంగా పరవళ్ళు తొక్కించి ఉరకలు పెట్టించాడు అష్టపదులరచనలో ప్రస్ఫుటమయ్యే అనంతనారాయణుని శబ్దనేతృత్వం శ్లోకరచనలో అంతగా కానరాదు మూలప్రతిలో గ్రంథాంతంలో గద్య తరువాత అనంతనారాయణుని రచనాసౌలభ్యాన్ని పాటవాన్ని ప్రతిబింబిస్తున్న యీ క్రింది శ్లోకం వున్నది. ఇది అనంతనారాయణ కవికృతమో కాదో యితరు లెవరైనా రచించారో చెప్పలేము.

రచితం శంకరచరితం
బృహదంబాగర్భసంభవే నేదం
మోదాయభవతుసుదృశా
మనురణితం.... శుకబాలకేనైవ॥

గీతశంకరం తాళపత్రప్రతులు తంజావూరు సరస్వతీమహాలులో ఉన్నాయి. దేవనాగరిలిపిలోనే యీ ప్రతులున్నట్లు కేటలాగులో పేర్కొనబడింది. 6661 నెంబరుగల కేటలాగు 61వ పేజీలో యీ క్రిందివిధంగా గీతశంకరం గురించి ఉటంకించబడింది దీనివల్ల అనంతనారాయణుడు ఆత్రేయ గోత్రజుడనీ అనంతయజ్వ ప్రపౌత్రుడు—కృష్ణదీక్షితపౌత్రుడు—బృహదంబామృత్యుంజయుల పుత్రుడనీ స్పష్ట పడుతున్నది.

Catalogue No. 6661 Page No. 61 Right column

Substance - paper size $6\frac{5}{8}$ x $3\frac{7}{8}$ inches. Sheets 44.

Lines - 6 to a page. Script - Devanagari No. of Granthas - 340

Author - Ananta Narayana. Complete.

Subject :- Geetasankaram

Remarks :- The manuscript is in a fairly good condition.

This is also a work on the model of "GEETAGOVINDA" dealing with the praise of Sankara.

The Author belongs to Atreya Gotra and gives his genealogy thus.

ANANTAYAJVANA

KRISHNA DIKSHITA




He is also called "PANCHA RATNA KAVI'

గీతశంకరకర్తయైన అనంతనారాయణునికి పంచరత్నకవి అని బిరుదున్నది ఇది యీ కవితల్లజుని కెవరైనా సంభావించి యిచ్చిన బిరుదమో ఆనువంశికమో చెప్పలేము. ఈ అనంతనారాయణుని పూర్వులలో రత్నఖేట నామాంకితుడైన శ్రీనివాసదీక్షితుడున్నాడు అనంతనారాయణుని తాత-మృత్యుంజయుని తండ్రి అయిన కృష్ణదీక్షితునికి అయ్యాదీక్షితుడని నామాంతరమున్నట్లు కొందరు భావించారు. ఇతడు ఘటికాశతగ్రంథకర్తగా కీర్తి నార్జించాడు. అనంతనారాయణుని తండ్రి

మృత్యుంజయకవిరచితమై దశసర్గాత్మకమైన "ప్రద్యుమ్నోత్తరచరిత్ర" అముద్రితమై పడివున్నది ఆంధ్రుడేనేమో ననిపిస్తున్న యీ అనంతనారాయణకవి యెప్పటివాడో యిదమిత్థంగా చెప్పలేముగాని క్రీ. శ. 17వ శతాబ్దిలో ఉండి వుండ వచ్చును.

## రాగతాళాలు

అనంతనారాయణు డీ కృతిలో రచించిన 22 శ్లోకాలలోనూ నాలుగే నాలుగు భిన్నవృత్తాలు. మిగిలినవి అనుష్టుప్ శ్లోకాలు మాత్రమే—కాగా భిన్న వృత్తాలకు మాత్రమే రాగాలు ఉటంకించబడినాయి. సాధారణంగా మిగిలిన అనుష్టుప్‌లన్నీ రసభావానుగుణాలైన రాగాలలో యేరాగాలలోనైనా పాడుకొన వచ్చును వివిధవృత్తగానాలలో చూపవలసిన రాగాలాపనం అల్పతర శ్లోకాలైన అనుష్టుప్‌లవంటి వాటి గానంలో చూపవలసిన ఆవశ్యకతలేదు. అంతటి దీర్ఘరాగాలాపన అసహజం, ఔచితీరహితం కూడా అవుతుంది కాబట్టి గీతశంకరంలోని వృత్తభిన్నాలయిన శ్లోకాలకు రాగాలివ్వలేదు

ఈ శ్రీ గీతగోవింద-గీతశంకరాలలోవున్న శ్లోకాలకు అష్టపదులకు సమకూర్చబడిన రాగ స్వరూపాలు నిర్బంధ బంధితాలు కావు ఇవి సమర్థాలుగా ఉంటాయని సూచించడానికి మాత్రమే రూపకల్పన చేయబడ్డాయి రసభావానుగుణంగా యథేచ్ఛగా రాగాలాపనలతో యెవరియిష్టం వచ్చినట్లు వారు తదభిజ్ఞులు సంగీతం సమకూర్చుకొనవచ్చును. ఈ రెండు కావ్యాలకూ ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో కర్ణాటక సంగీతం ప్రొడ్యూసరుగా ఉన్న శ్రీ మంచాల జగన్నాధరావు గారు తమకున్న విశేష సంగీతానుభవంతో రాగతాళస్వరకల్పనం చేశారు గంగాయమునల సంగమంవలె సంగీత సాహిత్యాల సంగమసాహిత్యం మూర్తిభవించినట్లు అవతరించిన శ్రీ గీతగోవింద-గీతశంకర కావ్యాలు సంగీత స్వరూప సంకలితాలై స్వరతాళరాగమయాలుగా వెలువడడం యిదే తొట్టతొలిసారి. శ్రీ గీతగోవింద-గీతశంకరాలలోని అష్టపదులకున్న విభిన్న రాగతాళాలు విడివిడిగా అనుబంధాలుగా ప్రకటించడం జరుగుతున్నది

సంగీతసాహిత్యసరస్వతీ ప్రతిమూర్తులైన యీ సత్కృతులు పఠించి-గానామృత రసాస్వాదనంచేసి రసజ్ఞులానందింతురుగాక.

భారతదేశమంతటా అత్యంతవిపుల ప్రచారంలోఉన్న శ్రీ జయదేవుని శ్రీ గీతగోవిందానికి సంగీతరచనచెయ్యడమే కాక-తంజావూరు సరస్వతీమహాలులో అముద్రితమై పడివున్న గీతశంకరం ప్రతిని సంపాదించి సంగీతరచనచేశారు శ్రీ జగన్నాధరావుగారు. ఆకాశవాణికేంద్రంనుంచి ప్రసారనిమిత్తమై అధికారుల పనుపుపై హైదరాబాద్‌నుంచి శ్రీ వారణాసి రామమూర్తి "రేణు" గారితో కలిసి శ్రీ జగన్నాధరావుగారు తంజావూరువెళ్లినప్పుడు దీని పూర్తిప్రతిని కాపీచేశారు.

ఈ శ్రీ గీతగోవింద-గీతశంకరకృతులను సంగీతరచనతోపాటు ముద్రించాలని గతంలో స్టేట్ ఆర్కైవ్సు డెరక్టర్‌గాఉన్న శ్రీ **P.** సీతాపతి **I. A. S** గారు ప్రభుత్వా

నుమతిపొందారు. కాగా శ్రీ గీతగోవింద–గీతశంకరములు సంగీతరచనతోసహా పూర్తి గ్రంథాలు శ్రీ జగన్నాథరావుగారి సంపాదకత్వాన ముద్రితమై వెలువడుతున్నవి.

అమూల్య ప్రాచీనగ్రంథాల ప్రచురణకై మన సంస్కృతీసంపదల పునరుద్ధరణకై అత్యంత శ్రద్ధాభక్తులతో అవిరళాసక్తి చూపిస్తూ సారథ్యంవహిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ పి. వి. నరసింహారావు గారికి – విద్యాశాఖకార్యదర్శి శ్రీ యస్. ఆర్. రామమూర్తి I. A. S గారికి ఉపకార్యదర్శి శ్రీ డి కామయ్య సహాయకార్యదర్శి శ్రీ ఐ. రఘునాథరావు గార్లకు మా కృతజ్ఞతలు. ప్రభుత్వం ప్రచురిస్తున్న యీ గ్రంథాలను ఓర్మితో శ్రద్ధతో సుందరతరంగా ముద్రిస్తున్న ఆంధ్రప్రదేశ్ టెక్స్టుబుక్ ప్రెస్ డైరక్టర్ శ్రీ నారాయణ రావుగారికి – అడుగడుగునా సహకరించి తోడ్పడుతున్న డిప్యూటి డైరక్టర్ శ్రీ జి రామకృష్ణారావుగారికి ఇతర ఉద్యోగులకు మా హృదయ పూర్వక అభినందనలు.

వాఙ్మయమహోధ్యక్షు

*వడ్లమూడి గోపాలకృష్ణయ్య*

కళా – ప్రపూర్ణ

Joint - Director

Andhra Pradesh Government

Oriental Manuscripts Library and

Research Institute

Afzalgunj.

పరీధావి, తెలుగుఉగాది

16 – 3 – 1972

హైదరాబాదు.

# ఉపోద్ఘాతము

సంగీత సాహిత్యములతో నృత్యాభినయములను మేళవించినపుడు కలుగు పరమానందము అనుభవైకవేద్యము. ఇటువంటి ఆనందము మనకు యక్షగానముల వలన కలుగును. యక్షగానములు మనోజ్ఞమైన కథాసంవిధానము కలిగియుండుట వలన ప్రజారంజకములై యెక్కువ ప్రజాకర్షణాదిరాభిమానములు పొందుచున్నవి. తంజావూరులోగల ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో తెలుగు, సంస్కృత, కన్నడ, మలయాళ, హిందీ భాషలలో పెక్కు యక్షగానములున్నవి. వీనిలో తెలుగు సంస్కృతములలోని యక్షగానములు కొన్ని పరిష్కరింపించి ముద్రింపించబడినవి. సంగీత ప్రాధాన్యములైన ఈ యక్షగానములు స్వరసహితముగా సకృత్తుగా ముద్రితమైనవి. నాకు తెలిసినంతలో స్వరసహితముగా ముద్రితమైనవి రెండు మూడు మాత్రమే కలవు.

ఒకసారి తంజావూరులో నున్న ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు నేను మిత్రులతో కలసి వెళ్లవలసి వచ్చినది వెళ్లినతరువాత సంగీత సాహిత్య విషయములలో గల క్రొత్త గ్రంథములనంతవరకు వెలుగు చూడనివానిని పరిశీలించుటకు ప్రారంభించితిని. గ్రంథాలయమునందలి తాళపత్ర గ్రంథములలో చాలవరకు తెలుగు లిపిలోను, గ్రంథలిపిలోను వ్రాయబడియున్నవి వీనిలో హిందీ, సంస్కృత భాషలలో గల రెండు గ్రంథములు మా దృష్టిని విశేషముగా నాకర్షించినవి.

మొదటిది రాధా వంశీధర విలాస నాటకము ఇది హిందీ ప్రజభాషలో రచించబడిన యక్షగానము రెండవది గీతశంకర మను సంస్కృత యక్షగానము.

గీతగోవిందము జయదేవ మహాకవిరచించిన నాటినుండియు నటువంటి రచనలను పెక్కురు తరువాతి రచయితలు వ్రాసియున్నారు అటువంటివానిలోనిదే యీ గీతశంకరమను సంస్కృత యక్షగానము. ఇది యష్టపదులలో శ్లోకములలో గీతగోవిందమునకు యనుకృతిగా యనుసరించినట్లు స్పష్టముగా బోధపడుచున్నది దీనిని పంచరత్నకవియను బిరుదుగల అనంతనారాయణుడు రచియించినాడు

గీతగోవిందము పఠనపారాయణాదులలో అందరునెరిగినదేకదా! అయినను రెండు మూడు మాటలు ఈ సందర్భములో వ్రాయకతప్పదు ఇందలి యష్టపదులకు గల రాగతాళముల నెవరికి తోచినట్లు వారు మార్చి భిన్నరీతులలో పాడుచున్నారు. తాళములకు సంబంధించి ప్రత్యేకించి యొక విషయమిక్కడ గుర్తింపవలయును. ఆరు మాత్రలుగల "శ్రితకమలా కుచ మండల" యను అష్టపది రూపక తాళమును "వదసి యది కించిదపి" అను సష్టపది యైదు మాత్రలుగల జంపె తాళమునను పాడవలయును. "మామియంచలితా విలోక్య వృతం" అను నష్టపది యేడు మాత్రలుగల త్రిపుట లేదా సాకు తాళమునను "లలిత లవంగ లతాపరిశీలన"

అను నష్టపది ఆది తాళమునను పాడుకొనవలయును. ఇదేవిధముగ సాహిత్యము నందలి పదముల పొందిక గమనించినచో వాని ఛందస్సుల ననుసరించి యష్టపదు లన్నింటికిని తాళములు స్పష్టముగా తెలుసుకొనవచ్చును. సంస్కృతమున—"రామ–రమ" యను పదములకు అర్థములో నెంత భేదమున్నదో ఒక నడకలోగల సాహిత్య మును వేరొక నడకగల తాళముతో పాడినచో నంతటి యర్థభేదమువచ్చి, సొగసు చెడి సంగీతార్థము మాసిపోవును ముద్రణలో వచ్చిన యిబ్బందుల వలన పైస్థాయిని సూచించు చుక్కలు సరిగమలపై పెట్టలేక పోయినాము. కొన్ని యెడల నడ్డగీతలు సైతము సరిగా నుంచలేక పోయినాము. సంగీత శాస్త్రజ్ఞులైనవారి పట్టులను సులభముగా గుర్తించి పాడుకొనగలరు.

ఈ యక్షగానములను ప్రజారంజకముగ పాడించుట జరిగినది. స్వరబద్ధముగా వెలువడిన ఈ గ్రంథమునందు చిన్న చిన్న దోషములేమైన కనపడినచో వానిని రాగ తాళ భాగములను దృష్టిలో నుంచుకొని, సాహిత్యము నెఱిగి దిద్దుబాటులు జేసి కొని పాడుకొనవలయునని నా ప్రార్థన.

హైద్రాబాదు,
1–11–1971.

ఇట్లు
విధేయుడు
*మంచాల జగన్నాథరావు.*

# శ్రీ గీతగోవిందము

## ప్రథమ సర్గము

శ్లోకము :— మియామల్హార్ రాగం

మేఘైర్మేదుర మంబరం వన భువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమంరాధే గృహప్రాపయః
ఇత్థం నందనిదేశ తశ్చలితయోః ప్రత్యధ్వ కుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలే రహః కేలయః ॥

శ్లో :— శ్యామ్ కళ్యాణ్ రాగం

వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తపద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తి
శ్రీ వాసుదేవ రతికేళి కథాసమేత
మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్ ॥

శ్లో :— కళ్యాణి

యది హరిస్మరణే సరసంమనో
యది విలాస కలాసు కుతూహలం
మధుర కోమల కాంత పదావళీం
శృణుతదా జయదేవ సరస్వతీమ్ ॥

శ్లో :— మోహన

వాచః పల్లవ యత్యుమాపతి ధరస్సందర్భ శుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ శరణశ్లాఘ్యో దురూహద్రుతేః
శృంగారోత్తర సత్ప్రమేయ రచనై రాచార్య గోవర్ధనః
స్పర్ధీకోపినవిశ్రుతశ్శ్రుతిధరో ధోయీకవిక్ష్మాపతిః ॥

అష్టపది :— (ధవళము) మియామల్హార్ ఏకతాళం

ప్రళయ పయోధిజలే ధృతవానసివేదం
విహిత వహిత్ర చరిత్రమఖేదం
కేశవధృత మీనశరీర జయజగదీశహరే ॥ 1

క్షితిరతి విపులతరేతవతితిష్ఠతిపృష్ఠే
ధరణి ధరణకిణ చక్ర గరిష్ఠే
కేశవః ధృత కచ్ఛపరూపః జయజగదీశహరే ॥ 2

వసతి దశనశిఖరే ధరణీతల లగ్నా

శశిని కళ జ్కకలేవ నిమగ్నా
కేశవః ధృత సూకర రూపః జయజగదీశహరే ॥ 3

తవకర కమలే నఖమద్భుత శృంగం
దళిత హిరణ్యకశిపువర భృంగం
కేశవః ధృత నరహరిరూపః జయజగదీశహరే ॥ 4

ఛలయసి విక్రమణే బలిమద్భుత వామనః
పదనఖ నీరజనిత జనపావన
కేశవ ః ధృత వామనరూప ః జయజగదీశహరే ॥ 5

క్షత్రియ రుధిరమయే జగ దపగతపాపం
స్నపయసి పయసి శమితభవ తాపం
కేశవ ః ధృత భృగుపతిరూప ః జయజగదీశహరే ॥ 6

వితరసి దిక్షురణే దిక్పతి కమనీయం
దశముఖ మౌళి బలిం రమణీయం
కేశవ ః ధృత రామశరీర ః జయజగదీశహరే ॥ 7

వహసివపుషి విశదీ వసనం జలదాభం
హలహతిభీతి మిళిత యమునాభం
కేశవ ః ధృతహలధర రూప ః జయజగదీశహరే ॥ 8

నిందతి యజ్ఞవిధే రహహ శృతి జాతం
సదయ హృదయదర్శిత పశు ఘాతం
కేశవ ః ధృత బుద్ధశరీర ః జయజగదీశహరే ॥ 9

మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలం
ధూమకేతు మివ కిమపి కరాలం
కేశవః ధృత కల్కిశరీర ః జయజగదీశహరే ॥ 10

శ్రీ జయదేవ కవేరిదముదిత ముదారం
శృణు శుభదం సుఖదం భవసారం
కేశవ ః ధృతదశవిధరూప ః జయజగదీశహరే ॥ 11

ససనస। మామగ ॥ పా మప। దసదప ॥
ప్రళయప। యోధిజ ॥ లేధృత। వా–నసి ॥
ప మ దప। మా––– ॥
వే–––। దం––– ॥
ససనస। సదదప ॥ పమదప। మారిస ॥
విహితవ। హి – తచ ॥ రి – త్రమ। ఖేదం – ॥

పాపప। దపసా ॥ సససిరి। సాదా ॥
కేశవ। ధృతమీ ॥ నశకే – । ర – ॥
పపపప। మపదప॥ మా – గ। రిసా॥
జయజగ। దీ – శహ ॥ రే––। –– ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— వసంతరాగం
వేదానుద్ధరతే జగన్నివహతే భూగోల ముద్బిభ్రతే
దైత్యాన్ దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలంకలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయతుభ్యంనమః ॥

అష్టపది :— భింపలాసీరాగం రూపకతాళం
(మంగళము)
శ్రితకమలా కుచమండల ! ధృతకుండల ! ఏ
కలితలలితవనమాల ! జయజయ దేవ ! హరే ! ॥ 1
దినమణి మండల మండన ! భవఖండన ! ఏ
మునిజన మానస హంస ! జయజయ దేవ ! హరే ! ॥ 2
కాళియ విషధరగంజన ! జనరంజన ! ఏ
యదుకుల నలినదినేశ ! జయజయ దేవ ! హరే ! ॥ 3
మధుముర నరకవినాశన ! గరుడాసన ! ఏ
సురకులకేళినిదాన ! జయజయ దేవ ! హరే ! ॥ 4
అమల కమల దళలోచన ! భవమోచన ! ఏ
త్రిభువన భవననిదాన ! జయజయ దేవ ! హరే ! ॥ 5
జనక సుతాకుచ భూషణ ! జితదూషణ ! ఏ
సమరశ మిత దశకంఠ ! జయజయ దేవ ! హరే ! ॥ 6
అభినవజలధరసుందర ! ధృతమందర ! ఏ
శ్రీముఖ చంద్ర చకోర ! జయజయ దేవ ! హరే ! ॥ 7
తవ చరణే ప్రణతావయమితి భావయ ఏ
కురు కుశలం ప్రణతేషు జయజయ దేవ ! హరే ! ॥ 8
శ్రీజయదేవ కవేరిదం కురుతేముదం ఏ
మంగళముజ్వల గీతి జయజయ దేవ ! హరే ! ॥ 9
పమ । పససా ॥ నిని । సగరిస ॥
శ్రిత । కమలా ॥ కుచ । మం – డల ॥
నిని । సగరిస ॥ నిసా ।. నిదపా ॥

ధృత । కుం - డల ॥ ఏ - । - - - - ॥
సగ । మపనిద ॥ పమ - । గరిసా ॥
కలి । తలలిత ॥ వన । మా - లీ ॥
రిసనీ । సపపా ॥ మగ । మా - - ॥ గరి । సా - - ॥
జ-య । జయదే ॥ వహ । రే - - ॥ - - । - - ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— ముఖారి
పద్మాపయోధరతటీ పరిరంభ లగ్న
కాశ్మీర ముద్రిత మురో మధుసూదనస్య
వ్యక్తానురాగ మివ ఖేలదనంగ ఖేద
స్వేదాంబుపూర మనుపూరయతుప్రియమ్ ॥

శ్లో :— కళ్యాణి
వసన్తే వాసంతీ కుసుమకుమారై రవయవై
ర్భ్రమంతీ కాంతారే బహువిహిత కృష్ణానుసరణాం
అమంద కందర్ప జ్వర జనిత చింతాకులతయా
వలద్బాధాం రాధాంసరసమిద మూచే సహచరీ ॥

అష్టపది :— బసంత్ బహార్ రాగం ఏకతాళం
లలిత లవంగ లతాపరిశీలన కోమల మలయసమీరే
మధుకర నికరక రంబిత కోకిల కూజితకుంజకుటీరే
విహరతి హరిరిహ సరసవసంతే నృత్యతి
యువతిజనేనసమంసఖి : విరహిజనస్యదురన్తే ॥ 1
ఉన్మద మదన మనోరథ పథికవధూజన జనితవిలాపే
అలికుల సంకులకుసుమ సమూహ నిరాకుల వకుల కలాపే ॥ 2
మృగమద సౌరభ రభసవశంవదనవదళ మాల తమాలే
యువజన హృదయవిదారణ మనసిజనఖరుచికింశుకజాలే ॥ 3
మదన మహీపతి కనకదండరుచికేసర కుసుమ వికాసే
మిళితశిలీముఖ పాటల పటల కృతస్మరతూణ విలాసే ॥ 4
విగళితలజ్జితజగదవలోకనతరుణ కరుణ కృతహాసే
విరహిని కృంతనకుంత ముఖాకృతి కేతక దంతురితాశే ॥ 5
మాధవికాపరిమళలలితే నవమాలతి జాతిసుగంధౌ
మునిమనసామపి మోహనకారిణి తరుణా కారణబంధౌ ॥ 6
స్ఫురదతి ముక్తలతాపరి రంభణ ముకుళిత పులకితచూతే
బృందావన విపినే పరిసర పరిగత యమునా జలపూతే ॥ 7

శ్రీ జయదేవ భణిత మిద ముదయతి హరిచరణ స్మృతిసారం
సరసవసంత సమయవన వర్ణన మనుగత మదనవికారమ్ ॥ 8

నిసనిప। మపగమ ॥ నిదసని। రీసాస ॥
లలితల। వం-గల ॥ తా-పరి। శీలన ॥
పనినిని। స నిరిసనిప ॥ మపనిద। నీసా ॥
కో-మల। మ-ల-యస ॥ మీ- - -। -రే ॥
మపనిస ।నిసనిప ॥ మగగమ। రీసస ॥
మధుకర। నికరక ॥ రం-బిత। కోకిల ॥
సమమమ। మపగమ ॥ నిదసని। రీసా ॥
కూ-జిత। కుం-జకు ॥ టీ- - -। -రే ॥
మపనిద। నిసరిస ॥ గమరిస। సనిరిస నిప ॥
విహరతి। హరిరిహ ॥ సరసవ। స- - -న్తే- ॥
పనినిని। నిసనిప ॥ మగగమ। రీసస ॥
నృ-త్యతి। యువతిజ ॥ నే-నస। మంసఖి ॥
సమమమ। మపగమ ॥ నిదసని। రీసా ॥
విరహిజ। ని-స్యదు ॥ ర- - -। -న్తే ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను.)

శ్లోకము:— *కళ్యాణి*

దరవిదళిత మల్లీవల్లి చంచత్పరాగ
ప్రకటిత పటవాసై ర్వాసయ న్కాననాని।
ఇహహి దహతి చేతః కేతకీ గంధబంధుః
ప్రసర దసమబాణప్రాణవ ద్గంధవాహః ॥

శ్లో:— *అఠాణ*

ఉన్మీలన్ మధుగంధ లుబ్ధ మధుపవ్యాధూత చూతాంకుర
క్రీడత్కోకిల కాకలీకలరవై రు ద్గీర కర్ణజ్వరాః
నీయంతే పథికైః కథం కథమపి ధ్యానావధానక్షణ
ప్రాప్తప్రాణ సమాసమాగమరసోల్లాసై రమీ వాసరః ॥

శ్లో:— *వసంత*

అనేకనారీ పరిరంభ సంభ్రమ
స్ఫురన్మనోహారి విలాసలాలసం
మురారి మారాదుపదర్శయంత్యసౌ
సఖీసమక్షం పునరాధి రాధికా ॥

అష్టపది :— తిలంగ్ రాగం ఏకతాళం

(భ్రమరము) చందనచర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళిచలన్మణికుండల మండిత గండ యుగస్మితశాలీ।
హరిరిహముగ్ధవధూ నికరే-విలాసిని విలసతి కేళిపరే ॥ 1
పీనపయోధర భారభరేణహరిం పరిరభ్యసరాగం
గోపవధూరనుగాయతికాచి దుదంచిత పంచమరాగం ॥ 2
కాపివిలాసవిలోలవిలోచన ఖేలన జనిత మనోజం
ధ్యాయతి ముగ్ధవధూరధికం మధుసూదన వదనసరోజం ॥ 3
కాపి కపోలతలే మిలితా లపితుం కిమపి శ్రుతిమూలే
కాపిచుచుంబం నితంబవతీ దయితంపులకై రనుకూలే ॥ 4
కేళి కళాకుతుకేనచకాచదముం యమునా జలకూలే
మంజులవంజుల కుంజగతం విచకర్షకరేణ దుకూలే ॥ 5
కరతలతాళ తరళ వలయావళి కలిత కలస్వనవంశే
రాసరసేసహ నృత్యపరాహరిణా యువతిః ప్రశంసే ॥ 6
శ్లిష్యతికా మపిచుంబతి కామపి రమయతి కామపిరామాం
పశ్యతినస్మిత చారుతరామపరామనుగచ్ఛతివామామ్ ॥ 7
శ్రీ జయదేవ భణితమిద మద్భుత కేశవకేళి రహస్యం
బృందావన విపినే లలితం వితనోతు శుభానియస్యమ్ ॥ 8

గమపస। నిపపమ ॥ గమపమ। గమమమ ॥
చం-దన। చ-ర్చిత ॥ నీ-లక। ళే-బర ॥
సగ మప। పానిపమగమా ॥నిపసీ। సా-- ॥
పీ-తవ। సన-వన ॥ మా - -। లీ - - ॥
పనినగ। గమరిస ॥ నిసరిస। నిసనిప ॥
కే - ళిచ। ల - న్మణి ॥ కుం-డల। మం-డిత ॥
మామమ। గమనిప ॥ సానిప మా। గా-- ॥
గండయు। గ - స్మిత ॥ శా--లీ। --- ॥
గగగమ। రీసస ॥ రిసనీసమ। గా-- గ ॥
హరి రిహ। ముగ్ధవ ॥ ధూ--నిక। రే-- వి ॥
మాగమ। సగమప ॥ పసనిప। మా పమగా ॥ సా--।
లాసిని। విలసతి ॥ కే-ళిప। రే--- ॥ ---।

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను.)

శ్లోకము :— భైరవి

విశ్లేషా మనురంజనేవ జనయ న్నానంద మిందీవర
శ్రేణీ శ్యామల కోమలై రుపనయన్నంగై రనంగోత్సవం
స్వచ్ఛందం వ్రజసుందరీభి రభితః ప్రత్యంగ మాలింగితశ్
శృంగారస్సఖి మూర్తి మానివ మథౌముగ్ధోహరిః క్రీడతి ॥

శ్లో :— తిలంగ్ రాగం

నిత్యోత్సంగవ సద్భుజంగ కబల క్లేశాదివేశాచలం
ప్రాలేయప్లవ నేచ్ఛయానుసరతి శ్రీఖండ శైలానిలః
కించస్నిగ్ధరసాల మౌళి ముకుళా న్యాలోక్యహర్షోదయా
ఉన్మీల న్తికుహూః కుహూరితికలోత్తాలాః పికనాంగిరః ॥

శ్లో :— శ్యామకళ్యాణి

రాసోల్లాసభరేణ విభ్రమ భృతా మాభీరవామ భ్రువా
మభ్యర్ణం పరిరభ్య నిర్భర మురః ప్రేమాన్ధయా రాధయా :
సాధు త్వద్వదనం సుధామయ మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజాదుత్కట చుంబితస్మిత మనోహారీ హరిఃపాతువః ॥

ఇతి శ్రీజయదేవ కవికృతౌ శ్రీగీతగోవిందే
సామోద దామోదరోనామ
ప్రథమస్సర్గః

# శ్రీ గీతగోవిందము

## ద్వితీయ సర్గము

శ్లోకము :— కావి

విహరతి వనేరాధా సాధారణ ప్రణయే హరౌ
విగళిత నిజోత్కర్షా దీర్ష్యా వశేన గతాన్యతః
క్వచిదపి లతాకుంజే గుంజన్మధువ్రతమండలీ
ముఖర శిఖరే లీనా దీనా ప్యువాచ రహసఖీమ్ ॥

అష్టపది :— తోడి త్రిపుటతాళం

సంచరదధరసుధా మధురధ్వని ముఖరిత మోహనవంశం
చలిత దృగంచలచంచల మౌళికపోలవిలోల వతంసం
రాసే హరిమిహ విహిత విలాసం
స్మరతి మనోమమ కృత పరిహాసం ॥ 1

చంద్రక చారుమయూర శిఖండ కమండల వలయిత కేశం
ప్రచుర పురందర ధనురనురంజిత మేదుర ముదిర
సువేషం ॥ 2

గోప కదంబ నితంబవతీముఖచుంబనలంబిత లోభం
బంధుజీవ మధురాధర పల్లవ కలిత దరస్మిత శోభం ॥ 3

జలదపటల చలదిందు వినిందక చందన బిందులలాటం
పీనపయోధర పరిసర మర్దన నిర్దయహృదయ కవాటం ॥ 4

విపులపులక భుజపల్లవ వలయిత వల్లవ యువతి సహస్రం
కరచరణోరసి మణిగణ భూషణ కిరణ విభిన్నతమిస్రం ॥ 5

మణిమయమకర మనోహర కుండల మండిత గండముదారం
పీతవసన మనుగత మునిమనుజ సురాసుర వరపరివారం ॥ 6

విశద కదంబతలే మిళితం కలికలుషభయం శమయంతం
మామపి కిమపి తరంగదనం దృశామన సారమయంతం ॥ 7

శ్రీ జయదేవ భణిత మతిసుందర మోహన మధురిపురూపం
హరిచరణస్మరణం ప్రతిసంప్రతిపుణ్యవతా మనురూపం ॥ 8

సరిగ । మదదప ॥ దామగ । మాదద ॥
సంచర । ధరరసు ॥ ధామధు । రధ్వని ॥
మమదద । మగరిరి ॥ గా–– । రీసా ॥
ముఖరిత । మో–హన ॥ వం–– । –శం ॥

మగమద । నిససస ॥ సాసస । నిదదదని ॥
చలితధృ । గం-చల ॥ చంచల । మౌ-ళిక- ॥
మదదద । మదనిస ॥ నిద మ । గ । రిగ । రీసా ॥
పో-లవి । లో---॥ లవ తం । -।--। సం- ॥
సాసా । నిదదద ॥ మగమద । మదనిస సా ॥
రాసే । హరిమిహ ॥ విహితవి । లా---సం ॥
రిగరిస । నిదమద ॥ నిదమగ । రిరిసా ॥
స్మరతిస । నో-మమ ॥ కృతపరి । హా-సం ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

*శ్లోకము :—* *ఆహిర్ భైరవ్*

గణయతి గుణగ్రామం భామం భ్రమాదపినేహతే
వహతిచపరితోషం దోషంవిముంచతి దూరతః
యువతిషువలత్తృష్ణే కృష్ణేవిహారిణి మాం వినా
పునరపి మనోవామం కామం కరోతి కరోమికిమ్ ॥

*అష్టపది :—* *ఆహిర్ భైరవ్* *ఏకతాళం*

నిభృతనికుంజ గృహం గతయా నిశిరహసి నిలీయ వసంతం
చకితవిలోకిత సకల దిశారతి రభసభరేణ హసంతం
సఖిహేకేశి మథన ముదారంరమయమయాసహ
మదన మనోరథ భావిత యాన వికారం ॥ 1
ప్రథమ సమాగమ లజ్జితయా పటుచాటు శతైర నుకూలం
మృదుమధురస్మిత భాషితయాశిథిలీకృత జఘనదుకూలం ॥ 2
కిసలయశయన నివేశిత యాచిర మురసి మమైవశయానం
కృతపరి రంభణ చుంబనయా పరిరభ్య కృతాధర పానం ॥ 3
అలస నిమీలిత లోచనయా పులకావలి లలిత కపోలం
శ్రమ జల సకల కళేబరయా వరమదనమదాదతిలోలం ॥ 4
కోకిల కలరవ కూజితయా జితమనసిజ తంత్ర విచారం
శ్లథ కుసుమాకుల కుంతలయా నఖలిఖిత ఘనస్తన భారం ॥ 5
చరణ రణితమణి నూపురయా పరిపూరిత సురత వితానం
ముఖర విశృంఖల మేఖలయా సకచగ్రహచుంబన దానం ॥ 6

రతి సుఖ సమయరసాల సయాదర ముకుళిత నయన సరోజం
నిస్సహనిపతిత తనులతయా మధుసూదనముదితమనోజం ॥ 7
శ్రీ జయదేవ భణిత మిద మతిశయ మధురిపు నిధువన శీలం
సుఖ ముత్కంఠిత గోపవధూ కథితం వితనోతు సలీలమ్ ॥ 8

సగమ ప। దాదద ॥ పనిదప మమ। గమమగ రిరి ॥
నిభృత ని। కుంజగృ ॥ హం -- గత। యా --- నిశి ॥
ససరిస। నీసరి ॥ గా మదపద। మా -- ॥
రహసిని । లీయవ ॥ సం ---- । తం -- ॥
మదనిస । సారిస నిద ॥ మదనిస । సారిస నిని ॥
చకితవి । లో -- కిత ॥ సకలది । శా -- రతి ॥
నిరిసని । దపమగ । మాపమగరి । గా -- ॥
రభసభ । రే --- ణహ ॥ సం ---- । తం -- ॥
మదదనిసా । — నిదప ॥ మగరిరి । గమపారీ ॥
సఖిహే -- । కే-శి మథనము । దా -- రం ॥
ససరి । సరిమాగమ ॥ మదనిస । సారిస నిని ।
రమయమ । యా -- సహ ॥ మదనమ । నో -- రథ ॥
నిరిసని । దపమప ॥ మాపమగరి । సా -- ॥
భా — విత । యా-సవి ॥ కా ---- । రం -- ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— దేశకార్ రాగం

హస్తస్రస్త విలాసవంశ మనృజు భ్రూవల్లి మద్వల్లవీ
బృందోత్సారి దృగంతవీక్షిత మతి స్వేదార్ద్ర గండస్థలం
మాము ద్వీక్ష్య విలజ్జితం స్మిత సుధాముగ్ధా ననం కాననే
గోవిందం వ్రజసుందరీ గణవృతం పశ్యామి హృష్యామిచ ॥

శ్లో :— తోడి

దురాలోక స్తోకస్తబకనవకాశోక తిలకా
వికాసః కాసారో పవన పవనోపి వ్యథయతి
అపిభ్రామ్యద్భృంగీ రణిత రమణీయా నముకుళ
ప్రసూతి శ్చూతానాం సఖి శిఖరిణీం సుఖయతి ॥

గమా గగా రిసరిసని ।సాసా సగమవ ॥
పశ్యతి ఖదిరకృ ।శానుం।... ॥
ససా ససా నిరిసస నిని ।నిసరిగగా। ...గగ ॥
విరహకృ శా...భవ। దీ...యా। ...భవ ॥
గగా మపా మగగా రిసని। సాసా। .... ॥
విరహకృశా.. భవ।దీయా ... ॥
నిసా రిగా గగ గగ। రిసనిసరిగ ।గాగగ ॥
మా-సద మరనజ। తా...పభి। యాదివ ॥
గపా మపా మగ మావమ గరి। వగరిరిసని। నీ నిసగమ ॥
తా-వక వ-ద-గమ। నీ...। యాఃభ-వ ॥
పమగా మపా మగగా గరి సని। సాసా సా .. ॥
విర హాకృశా ....భవ। దీయా।.... ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— జననీ హృదయం జ్ఞాత్వా చింత్యమాన మివస్థితం
ధైర్య మాలంబ్య సా గౌరీశంకరం సమభాషతా ॥

శ్లో :— మోహన

ప్రదీప జ్వాలాభిః దివసకర నీరాజన విధిః
సుధానూతేః చంద్రోపల జలల వైరర్ఘ్య రచనా।
స్వకీయై రంభోభి స్సలిలనిధి సౌహిత్య కరణం
త్వదీయాభిర్వాగ్భిః తవ జనని వాచాం స్తుతిరియమ్ ॥

అష్టపది :— దేశాక్షి ఆదితాళం

అవనయ విషధర మణి మయహారం
జీవయకథమపిదూరిత మారం
కింతయాతవ శంకర చింతయా ॥ 1
త్యజన్కనకాహ్వాయ కుసుమ వితానం
విపదోన్మాదన విత్త నిదానం ॥ 2
పరిహర భిక్షాటన మతి ఘోరం
గౌరవ లజ్జాం బహు మతి చౌరం ॥ 3
రుధిరచషకకృత నరకపాలం
విసృజ దహన మయ మాయ నఫాలం ॥ 4
కరటితసృట్మయగజపరిధానం
ముంచ విలోపయదిక్పరి ధానం ॥ 5

అస్థి స్రుక్ పరికర్మిత ఫాలం
సంరుజ్యోన్నయ శశధర బాలం ॥ 6
భజనియదీశ శుభ ప్రదరూపం
ఫలతి మనోరథ తనురను రూపం ॥ 7
పంచరత్నకవి వరముఖ జాతం
గిరిజాగీతామృతమవదాతమ్ ॥ 8

.మగా పపా న సరిగమ-గరిసని। దపదా ॥
.అవ నయ విష-ధర మణిమయ హారం ॥
.దరీసనీ దపమగ। గరి గపప। పమ గ గరి స ॥
.జీవయ కథ మపి దూ..రిత మా..రం.. ॥
పమ గప దస నస సని దదప దప మగ గరి సా ॥
కిం-తమ యా-తవశం।- కరచిం।--త-యా ॥
(తక్కిన చరణమ్ములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :—

సంసార సాగరే మగ్నాన్ ప్రాకృతాన్ విబుధానపి
సమీక్ష్య కారుణ్య వాన్ మునిః కశ్చిదభాషత ॥

అష్టపది :— ఆనందభైరవి ఆదితాళం

కుసుమ వితానే కనకవిమానే-జగదవనాయవసంతం
విరచిత వేషం తనుచితి శేషం-జనతా భజతభవంతం
శివశైలేశోద్ధృతభుజగే-శోభన తటవన వాసే
అమరతటిన్యా అనుజభవాన్యా-దేవ్యా వసతి విలాసే ॥ 1
బహుమతమదనే విహరతిసదనే-జనయన్పరిజన మోదం
అపగతఖేదంముఖరితవేదం-పశ్యతవివిధవినోదం ॥ 2
అవిరతతానం సముదితగానం-పశ్యతనృత్తముదారం
ప్రణమతముదితం గణయతిసహితం-ప్రశమితచిత్తవికారం ॥ 3
బహుమణిఛాయాం కనకస ఛాయాం-నటనం కలయతి సాయం
దరణీవిబుధా ముదితాబహుధా-ధ్యాయతి చిన్మయకాయం ॥ 4
నిబిడితకేరే ఘటనాతీరే-సాంద్రతరాఖిలసాలే
పాలితమోదం బాణవినోదం-పశ్యన్ హృష్యతి కాలే ॥ 5
మంజులగానే మంగలయానే-మదయతి మానసమాజం
దలయతితోదం జనయతిమోదం-భజనీయాకృతిభాజం ॥ 6
అనుదితతపనే మృదుతరపవనే-ధామని వసతి సలీలం
అవిదితపాదం ప్రతిహతవాదం-భావయ తాదృశశీలం ॥ 7

ప్రకటితసేవం ప్రముదితదేవం-పంచరత్న కవిగీతం
పాతక భీతై ర్భావపిశు ద్యై-పఠనీయం భవగీతమ్ ॥ 8

నగమప పాపా। పదనిద దపపమ ॥
కుసుమవితానే। కనకవి। మా-నే- ॥
గమపప పమపమ గరి। రిమ మగమగ ।పా-- ॥
జగదవనా --- యవ। సం -----।తం--॥
పని సన సా సా। ససని నిరి స। నిదదప ॥
విరచిత వేషం। తను-చి-త। శే-షం- ॥
గమ పదప పమపమ గరి। రినిసా గరి। రిగస సా ॥
జనతా.. భ.జి.తభ। వం...। తం... ॥
పమ పపస సా సారిసని। సమగరి। సనిసా ॥
శి.వశై.లేశో...। దృతభుజ। గే.శో ॥
ప పని సస సనిద దనిద। దపపా। పా.. ॥
ఘన.తటవ.నవా..। సే..। ... ॥
సపగ మమ మా ప మమగ। గమపప। పాపా ॥
అమ.రత టి- న్యా...। అనుజభ। వాన్యా ॥
పాస నిగరిసని। సాసా। పమగరి సా ॥
దేవ్యా.వసతి వి। లా సే।...... ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :—

స్వాధీన పతికాసాధ్వీ ధీరారహసి లాలితా
పరిష్కృతాం ద్రష్టుకామా పార్వతీపతి మబ్రవీత్ ॥

అష్టపది :— మలహరిరాగం ఆదితాళం

కలయ మృదు దలధామపరిష్కృత నిటలత లోపరిభాగం
శశిధర సకల సముజ్వల దుల్బణ మణిమకుటోదితరాగం
యాహి మానద సోమశేఖరమా భజభూషణ దోషం
యానివిభూషణ భావగతాన్యపి పరిహర తానిసతోషం ॥
ఉజ్జ్వల నవ మణిగణ విలసిత కుండల మండితగండం
తవముఖ మమలం, విలసితనయనం, నవమివ చంద్రమఖండమ్ ॥
ఉడుగణ పరివృత హిమకరబింబమివోపరి వినిహిత నీలం

విలసతు జఠరే తపమణి పతగం మదన తురంగమ కీలమ్ ॥
బహుళతరల తరహారలతాహృది తారావళిరివ కేశే
భుజయుగళోపరి కనకమయే తవ కేయూరే జ్వలితాశే ॥
కటితట సుఘటిత సారస నావృత కమనీయాంబర పీతం
విరచయ పదకమలోపరి హంసకమంజుల శింజిత గీతమ్ ॥
మరకత మణి శకలాంచిత కంకణ ధలధల రోచిరుదారం
విరచయ కరకమలద్వయ మపితే భక్తజనాభయ పారమ్ ॥
పంచరత్న కవి చిత్తవికాసజ రుద్రాణీ పతివేషం
కరగత బదరీ ఫలమివ సుకృతం చింతయ తామవిశేషమ్ ॥
రిసరిమ। పపపమ ॥ మదదప। మగరిస ॥
కలయమృదులదల ॥ ధా.మప। దీ.ష్కృత ॥
సరిమప। గారిరి ॥ సాసా। సరిమపదా ॥ మమపద। ససస ॥
నిటులఅ। లోపరి ॥ భాగం। ... ॥ శశిధర। సకలస ॥
సమగరి। రిససస ॥ పపదప। మా.గరిరి ॥ సాసా। పామగరిస ॥
ము.జ్వల। దుల్బణ ॥ మణిమకు ॥ టో..దిత ॥ రాగం। ... ॥
సామప। గారిస ॥ దాప। పమపద ॥ దససరి। సరిమామగగరి ॥
యా.హి। మానద ॥ సోమ। శే.ఖర ॥ మా.భజ। భూ:ష.ణ.।
రిససా। ... ॥ పదదద। దాదద ॥ పదరిస। సదదప ॥
దో-షం। ...। యా.నివి। భూషణ ॥ భా.వగ। తా.న్యవి ॥
మమపప। దాలమ। పాపా। పామగరిస ॥
పరిహర। తానిస ॥ తోషం। ...... ॥

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :—

యోగ మాస్థాయతిష్ఠంతం శంకరం లోకశంకరం
ప్రాప్య గౌరీ సఖీప్రాహ తదవస్థామి మాంక్రమాత్ ॥

అష్టపది :— శంకరాభరణం ఆదితాళం

ధ్యాయతిసీదతివిలపతివితతం
గమ్యతితవగుణగణమపిసతతం
ప్రదేవ గృహే ముహ్యతి గౌరీ తాపమితం ॥ 1

ముంచతి నయనజలం బహువిమలం
సించతి ముహురురు కంచుకపటలం ॥ 2

నాళీకం నతు పశ్యతి బాలా
నాళీరపి సాదృష్టి రసాలా ॥ 3

ఆతప తాపితతనుమతిరేతే
తుహిన శిలామయ ఫలకేశేతే ॥ 4

రోదిత లీలా కలహ విలాపా
శాదిత మదనవిలాసజతాపా ॥ 5

పంచరత్నకవి కల్పిత గీతం
సోమ శేఖరముదేఽస్తు సుగీతం ॥ 6

గమపప దపపప। మపదని। సనిసా ॥
ధ్యా.యతిసి.దతి। విలపతి। నితతం ॥
సనిగరి సనిదప। గమపమ। గరిసా ॥
గం.మ్యతితవగుణ। గణమపి। సతతం ॥
సదసని సా..। సరిగమ। పమగరి ॥
దే.వగృహే.'। ము.హ్సాతి। గౌ.రి. ॥
గరి గమసా..। మపదని సనిదప। పమగరి సా ॥
తా.పమిదే..। ......। ...... ॥

(తక్కినచరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :—

శివానురాగజనితసంతాపం గొప్తుమక్షామా
విజనే మానసచింతామాహగౌరీ మనోరథమ్ ॥

అష్టపది :— ఆహిరిరాగం ఝంపతాళం

ఆతప మిషేనయదితాపకరగోపనం
శీతోపచారకృతజనితమతిగోపనం
కేనవాగోపయేయం తమిహ మనోరథం చింతయేనం ॥ 1

హిమ సలిలసే కోపిమమ తపనసాధనం
మలయజరస స్నపనమపి మానబంధనం ॥ 2

వ్యజనపవనోపి మమ మదన తురగాయతే
కుసుమమయ శయనమపి దహనశకలాయతే ॥ 3

హారలతికావపుషి మారపాశాయతే
శీతకిరణోపిమమ తాపకిరణాయతే ॥ 4

నాలీకదల కలిత కంచుకీధారణం
అలికరజః పటవ దాత్తతనుదారణం ॥ 5

శయనమతి శంకాహిజనయతి హి
మాచతే దలనమపి నీహారశీతే శీలాతతే ॥ 6

పంచరత్నాదికవి తల్పిజరసాయం
పరమశివ సాయుజ్య గమనసుగమాయనమ్ ॥ 7

పద। నిసస ॥ సా। సససని ॥ నిదనిద। నిసరిస। నినిప ॥ నిదపా ॥
ఆ.। తపమి ॥ షే। నయది. ॥ తా...। పకర. ॥ గో..। ప.నం ॥

నగ। మపద ॥ నినిద। పమమగ ॥ సగమపదప। మప గమ ॥
మగస। రిరిసా ॥

శీ.। తో.ప ॥ చా..। రకృత. ॥ జ.ని...। త.మతి ॥ గో..।ప.నం ॥

ససగ। మపా ॥ దపపమ। పదనిస ॥ పా। పపమ ॥ పప। దవిస ॥
కే..। నవా ॥ గో...। పయే.. ॥ యం। తమిహ ॥ మనో।. రథ ॥

నిపద। పమగ ॥ పమగస। రిసా ॥
చిం..। తయే.॥ వం...।

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— కళ్యాణి

కథమపిరతిగేహే ప్రాపయంతీ మృగాక్షీం
సరస వచన భంగయాసాదరం భాషమాణా
అవినపది విదిత్వాజాతకామాతిరేకా
సవిధ సహచరీ సాంభాషమాణేతియాతా ॥

అష్టపది :— సారంగ ఆదితాళం

బహుమత మదనే హిమగిరిసదనే-సంభృత రతిసాధనే
కదమపి సవిధం గతయావివిధం-కల్పితకనకాసననే
రుచిరే గంగాతట విపినే-విహరతి పురారిరుమయా ॥ 1

సురభిల సంలే వికసిత కమలే-వతసన గహనాంతరే
అవిదితభేదం గతరతిఖేదం-కల్పితకుముదాకరే ॥ 2

నిబిడితకీరే జలనిధితీరే-కల్పకసురభీకృతే
పరచితఖేలం ప్రభురతివేలం-సారసముఖరీకృతం ॥ 3

విలసిత చికురే కరధృతభ్రుకుటే-సజలకలితాజనే
అపగతకుహనం కుచభరసహనం-కలపనకమలాననే ॥ 4

శంకరపాదే మితసవివాదే-పంచరత్న శోభితే
విలసతు సదయంబుధజనహృదయం-పంకజ భవపూజితమ్ ॥ 5

.నిసారిసా రిమపా। .మపాదపా। దనిసా ॥
.బహుమతమదనే। .హిమగిరి। సదనే ॥
.నిరీ సనీ దదపమ। .దపమరిగ। రీసా ॥
.సం.భృతరతిసా.। ..వ.నే..। ॥
.మపాదపా దనిసా। .నిరీస సని। దదపా ॥
.కథ మపి సవిధం। .గ.తయా.। వివిధం ॥
.పా.పమా గమరీ। .రిసా। రిగమప దనిసా ॥
.కల్పిత కనకా। .సనం। ...... ॥
.నిసాదా. పపమగా। దపపపమ। గమరిస ॥
.రుచిరే.గం..గా। తటనిపి.। నే... ॥
.నిసారిసా రిరి పమ ప। పద నిసా। మదపమ గమరిస ॥
.విహార తిపురా..రి। రు.మయా। ......।
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము:—

ఆగలం గర లాక్రాంత మాకల్పిత భజంగమం
గోకర్ణేశంగతాప్రాహ బృహదంబా శాంసఖీ ॥

అష్టపది:— మలహరి ఆదితాళం

గరళమలిన గళజనిత భయేన-వినరతి యావిష వచన నయేన
తామవ గోకర్ణేశ్వర హరహర-తామవ గోకర్ణేశ్వరహరహర ॥ 1

భుజగ వలయయుత భుజయుగళేన
జనిత భయావినిహితగరళేన ॥ 2

మలయపవన మిషతుషదహనేన
వ్యసనమితాతవ ముఖపవనేన ॥ 3

పికశుకముఖ ఖగకల రణితేన
లులితమనాధురి హితభణితేన ॥ 4

మనసిజ శరతతి కృతదళితేన
వ్యథితతరహృది రసమిలనేన ॥ 5

సులభిల మలయ జ రసతపనేన
వ్యథితరాతప రిపులపనేన ॥ 6

అనల శకల సమదలశయనేన
విధతతమానినశశి నయనేన ॥ 7

అవిరల బహువిధ హిత కథితేన
జనితసుఖా భవ తవ విహృతేన ॥ 8

ప్రణమతభవమిహ శివచరితేన
బృహదంబాసుత విబుధ కృతేన ॥ 9

పంచరత్నాదిమకవిరచితే
గోకర్ణేశ్వర హరహర ॥ 10

.పపామ పప దసస। పదసరి। సా.ని నిదదప ॥
.గరళ మలినగళ। జనితభ। యే...న. ॥

.రిమాప నీనిద దసస। నిదపప। మగరిస ॥
.విదుర తియా..విష। వచనన। యే..న ॥

.నిదాససా రీ గరిరిస। రీగరి। సససస ॥
.తా.మవ గోక...। ర్ణేశ్వర। హరహర ॥

.పదాసరీ సససిదప। పమపమ। గరిరిస ॥
.తా.మవ గో..క.। ర్ణే.శ్వర। హరహర ॥

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— కామారిణా భగవతా ప్రేషితా చంద్రమౌళినా
మానేన విరసాం గౌరీం జగౌ హరదశాం సఖీ ॥

అష్టపది :— వరాళి రూపకతాళం

గళిత మణిమయ మాలోమదన మనుసంధామ
కలిత జలజ శకలో విరహదమనశమనాయ
తవనిగమేపురవైరీ బతసీదతి బాలే ॥ 1

వలతి జలద సమీరే మదనదహనభవాయ
దహతి శశి కరనికరే స్వసఖి విజయకరణాయ ॥ 2

రసతి విపినమయూరే విరహిజన విమోహాయ
నరతి జలధర వివరే మదమోజ్జీవనాయ ॥ 3

దపద। నిసని ॥ దసీ। సరిగరిగ ॥ గగరి। ససని ॥ దసీ। సా ॥
గలిత। మణిమ ॥ యమా। లో—... ॥ మదన। మనుసం। .ధా।యా. ॥

పదని। ననని ॥ దపమ॥ దపపమగ ॥ గగగ। దపమ ॥
కలిత। జలజ ॥ శకలో।- ... ॥ విరహ। దమన ॥
పమగ। గరిస ॥ ననిస। గగా ॥ పవాద॥ పదా ॥
శమనా। ..య ॥ తవని। గమే ॥ పురవై। .రీ ॥
ననిస। గరిరి ॥ సానవిస। ... ॥
బతసీ। .దతి ॥ భా..లే। ... ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

అష్టపది :— కేదారగౌళ ఆదితాళం

విహరతి పురరిపు రిహమదనవనే-
కిమితి విషీదతి సఖివద భవనే
శంకరే కురుసఖి భావముమే ॥ 1

అనుదిత మనుసర రహసివసంతం
తవముఖ కమల మధూనిపిబంతం ॥ 2

శశిధరలేఖాలంకృతమకుటం
నిజతను శోభారంజిత నికటం ॥ 3

వికసిత సరసిజ సుందరవదనం
రతిమకరధ్వజ మంగళ సదనం ॥ 4

ఏనహితామృశితం త్యజవిఫలం
ఇహసఖిమాకురు యౌవన మఫలం ॥ 5

లజ్జామానౌ కథమపి వారయ
మేనామానస రథమపి పూరయ ॥ 6

భుంక్ష్యతపఃఫలమదునోపనతం
మంగళభాజన వపుషావనితం ॥ 7

పంచరత్న కవి భాషిత గానం ॥
పార్వతీ పతి ముదే రసపానమ్। 8

.రిమాపనీ సరిరిరి। రిమగరి। సనిసా ॥
.విహరతి పురరిపు॥ రిహమద। నవనే ॥
.నిసారిసా సరిస నిదదప॥ పదప పమగ॥ గరిమరి సా ॥
.కిమితివిషీ...దతి। సఖి.వ.ద।భ.వ.నే ॥
రిమపప నీసరి। .మగ రిరి। సనిసా ॥
శం.కరే కురుస। ఖి--భా--వము.మే...। ... ॥

శ్లోకము :— మానేన విరహం ప్రాప్యకోపేన కలుషీ కృతా
గిరిజాముచితై ర్వాక్యైర్మాన ప్రాగి శంకరః ॥

అష్టపది :— ముఖారి ఝుంపెతాళం

నయన నళినేనయది పశ్యసి జనం ప్రియే
వ్యపనయతు దురితమతి దూరం
కనకమయ మందిరేకమలదలసుందరే
సతుపిబతు విషయసుఖపూరం శివే వామలీలే
త్యజసుహృదిరోష మపిదోషం
విషమశర పాతకీ విదళయతి దూరం
కామ పి పూరయనతోషం ॥ శివే ॥ 1

ఖేదయసి మానకరణేనయదిమామయే
తావక సుఖాయయతనీయం
విరహ విషమాస్మరస్త్వమియమబలా
జనస్త్వవిదిద మనుచింత్య కరణీయం ॥ శివే ॥ 2

శ్రమజలధి సాధనం రతివిరహ కారణం
పరిహర ముధామానసిమానం
యదివదసి కేవలం మమహృదయ మోహనం
ప్రభవాని తవసుఖ నిదానం ॥ శివే ॥ 3

ముఖకమల మండనం తనుజడిమ ఖండనం
శిశిరసమ యోదయస్వేదం
ఖదిర రస సాదితం కర్పూర భావితం
తాంబూల మాద్రియ స్వేదం ॥ శివే ॥ 4

అయిజఘన మండలం మణి రశన యోచితం
విరచయనినాదరమణీయం
కుచకుట్మ లాంతరే నవరత్న మాలికా
రోచయతు కాంతికమనీయం ॥ శివే ॥ 5

ఉరసిమమ వాసినీ సితినలిన భాసురే
శోభయ మమాఖిలశరీరం
పదకమలయోరుపరి మంజీర శింజితం
శ్రుతిపథం కలయమమధీరం ॥ శివే ॥ 6

నహికలహ కాలోయ మబలే రతిప్రియే
మాకృథా వితథమిహ కాలం
కమలదల నిర్మితం కాముక మనోహరం
శయన మవలోకయ విశాలం ॥ శివే ॥ 7

హరముఖ సమీరితం హిమగిరి సుతాహితం
పంచరత్నాది కవిగీతం
రతి కలహభంజనం శృతిశిఖరబంధురం
శ్రో తవ్యమేతదవిగీతం ॥ శివే ॥ 8

రిగ। రిసస॥సా। సగరిసని ॥ దనిద। సరి గరి ॥ రిరిసని। నిద పా ॥
నయ। ననలి ॥ నే। నయ-ది- ॥ వ-।శ్యసిజ ॥ -నం...। ప్రి-యే ॥
రిని।దనిదనిద॥దప ద। ససనినిద॥ పా।పమ గరిరిస। రిగ రిసస ॥
వ్యవ।నయ॥-తు॥మ।రి.తమ.తి।దూ రం...। కన । కమయ ॥
సా। సగరిసని -ద నిదం సరిమ। మా మదపమగ। రిపగ ।రిసరి ॥
మం।దిరే... ॥ కకు। లదల ॥ సుం।దరే... ॥ సతు। పిబతు ॥
రిమగరి। సనిని దనిప ॥ పమగరి। రిస రిమపని ॥
వి-ష-।యు-సు-ఖ- ॥ పూ... ...।రం... ॥
స।సా- ॥ -పద। నిద రిసనిద ॥ దప। పారి ॥ మప। రిమ పదప ॥
శి-వే- ॥ మ-।మ-లీ... ॥ లే శి।వే।వా-మ... ॥
పమగరి। రిసా. రిగ। రిసస ॥ సనినిద। ససరి ॥ రిమగరి। రిసా ॥
లీ...లే- ॥ త్యజ। సుహృది ॥ రో...।షమపి ॥ దో...।షం.. ॥
సరి।మపనిద॥దనిద।నిదపదనిద ॥ నిదగ రిసస ॥ సనినిద। పా ॥
విష। మశర ॥ పా...।త-కీ... ॥ విద-లయతి ॥ దూ...।రం ॥
పగ।రిసరి॥ రిమగరి।సనినిదదప॥పమగరి।సరిమపని॥నిదస।సా॥
కా.। మమపి ॥ పూ...।ర-య-స ॥ తో...।షం... ॥ శి వే. ॥

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— భర్తు స్సమారాధనమంతరేణ భావోన సాహిత్యవినిశ్చయేన
సంజాతమంచాక్షతయావిహస్తాంసంబోధయామాస సఖీక్రమేణ॥

అష్టపది :— కల్యాణి ఆదితాళం

అనుదిత మరుణ కరాంకురజృంభిత-కుసుమశరాసనబాణం
ఆహరపూజయ హరపద మచిరా-దవిదిత తరపరిమాణం
స్నిగ్ధేపుతరమరనం పరి వృథ మనునయబాలే ॥ 1

పంకజ భవనవ పంకజలోచన-భావనయాపిదురాపం
శంకర చరణ జుషామపి విదుషాం-పరిహృదమానసతాపం ॥ 2
శోభనపూర్వక గోమయ గోముఖ-రంగలతాభిరుపేతం
పరమకళ్యాణ నిదాన మిహాశ్రమ-మామోదేననమేతం ॥ 3
వేలా జనకుళ కల్పిత మానస-యోస్త్రీర్యోదకపాత్రం
ఆనీయాంతిక మిధివసశంభో-రానమ్యానత గాత్రం ॥ 4
కుంకుమ చందన ఘనసారేష్వర-సాది రసాయన జాతం
సంపాద్యోన్నతవేదితలోపరి-హరమారాధయ ఖాతం ॥ 5
మోచాకేర రసాలకపిత్థప-లావినివేదయకామం
దీపారాధన తోషితమయికురు-పశ్చాత్తాపయకామం ॥ 6
శంభోశంకర శశధరశేఖర-సాంబ శర్వభవమోచన
భక్తజనప్రియ పరమదయాలో పాహిపద్మనిభలోచన ॥ 7
ఇతిసఖి కథితంగిరిజాచరితం-పంచరత్నకవిగీతం
యోసౌగాయతి సాయంప్రాతః-చరితం తరతి పరీతం ॥ 8

పమనిచ పమగరి। గరెసని। సని ఢనిస ॥
అనుదిత మరుణక। రాం-కుర। జ్మం--ఖిల ॥
రిసరిరి పమగరి। పమగ మ।పా ॥
కుసుమశరా-సన। బా...। ణం ॥

పమ గమపదపదద। నిపదని। సనిరీ ॥
అ.. హరపూ-జయ। హరపద। మచితా ॥
గరిసస సనిచనిప। పనిదని। సా.. ॥
దనిదితి త-రపరి। మా....। ణం.. ॥

నీరీ....। .గరీ ససని। దససిద పపమ ॥
స్నిగ్ధే-...। పురమధ.। నం...వరి. ॥
గరి గరిగరి సస రిగమ। మగమపద। దా.. ॥
వృథ మ.ను.నయబా..। ..లే..। ...॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— శ్రీరాగం

త్యక్తాంతాపసవేషమాదిమమరం ప్రాప్తా జగన్మోహినం
శృంగారాది రసాయనం త్రిజగతాం ఆనంద సందాపినం
మందార ప్రభవ ప్రసూన కలికా సౌరభ్య సాంద్రీకృతం
గౌరీశంకర మేవకేళి సదనే సానంద మైక్షిష్టతమ్ ॥

అష్టపది :— మధ్యామావతి ఆదితాళం

గౌరీముఖ సరసీరుహ దర్శన హర్షితమానస హంసం
తుహినాచల మివభువనవిమోహన శశధర శకలవతంసం
సాదరమైక్షతసాకరుణాకర ఆనందోజ్జ్వల హాసం
హరమేకరసంవరమచిరద్యుతి భాసం ॥ 1
నయనమనోహర వదన నిశాకర-వంచిత హిమకరబింబం
చుంబనలోలుప చంచలపుటయుగ-దంత వసనమిష బింబం॥2
సురభి సరోరుహ మృదుల దళోపమ-నయనమమానమసంగం
క్షీరాంభోనిధివేలాతటమివ-ముక్తాఫలకులసంగం ॥ 3
కోమలమణిగణ ఖచితమనోరమ- కుండల మండిత గండం
చింతామణిమివచింతిత ఫలద-మభంగురసచ్ఛిదఖండం ॥ 4
అంబుద కోకిలషట్చరణస్వన-మంగీకృత్య వసంతం
శంబరవైరి సమాగమ కారణ-మయ్యాదృత్యవసంతం ॥ 5
మృగమద చందన సురభిళకంధర-మతిధవళం భగవంతం
నవమదనోచిత విహరణ సాధన-శయనీయేప్రభవంతం ॥ 6
వేదోహర ముఖవిబుధ మనోరథ-కల్పక కల్పక కందం
సాకూతస్మిత లీలావేక్షణ-మాలాయుక్త మమందం॥ 7
సూత్రేమణిమివగుంఫితమమలం-పంచరత్నకవిబంధం
పశ్యతి విబుధా భక్తిదమనిశం-గిరిజా కరుణాగంధమ్ ॥ 8
.రిమా పమా రిరినస। నిరినస నిని। సారిరి ॥
.గౌ.రీ.ముఖసర। సీ...రుహ। దర్శన ॥
.రిమా మమా మామమ। పానినిపమ। పమరీ ॥
.హ.ర్షిత మానస। హం...। సం.. ॥
.రిమాపనీ నినినిప। పనిసరి। నిససస ॥
.తుహినా.చలమివ। భువనవి। మో.హన ॥
.నిరీసనీ నిపపమ। మమరిస రిమపని। సా.. ॥
.శశిధర శకలవ। తం-......। సం.. ॥
ససా నిపా నీసస। .నిసా రిపమ। రిరినస ॥
.సా. దర మైక్షత। .సా.కరు.। ణా.కర ॥
.పనీనీ. సరిసని పమ। పా.ని సా। సరిసని పా ॥
.ఆం. నం.దో...జ్వల। హా..సం. హా.ర.మే ॥
పనినరిసని పపమమ। రీసస। రిమపని సా ॥
కరసం...వరరుచి । రద్యుతి । భా...సం ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— మోహన

చూడామణీ కృత శశాంక కలాసముద్యత్
జ్యోత్స్నావితాన బహులీకృత చంద్రపాదైః।
ఉద్దీప తారహాసికేళి గృహే నివిష్టం
దృష్ట్వా హరం హర సఖీ మియవిత్యువాచ ॥

అష్టపది :— ఘంటారవం ఝంపెతాళం

కంజదల పింజరిత కామ భవనే
ఇహవిహార రహసి నవ కుందరదనే
సపది బాలే మంగళ నిదానం-సఖిపురారిం రంజయపురే ॥ 1

పరిలగ్న నవరత్న మంచఫలకే
ఇహవిహార పరమశివ భోగరసికే ॥ 2

శశి శకల మృదుపవన జాతమదనే
ఇహవిహార కుసుమశర బాణనయనే ॥ 3

కమలవన గంధవహ సుమనోహరే
ఇహవిహార విషమశరకాతరతరే ॥ 4

సురభి భవకుసుమశర పోషితరమే
ఇహవిహార నవమదన సాధకతమే ॥ 5

అతిధవళ మృదులతర శయనోదరే
ఇహవిహార వివిధరతి భేదచతురే ॥ 6

కందళిత కోరకిత చంపకవనే
ఇహవిహార కుటిలతర కుంతలఘనే ॥ 7

పంచరత్నాదికవి వర్ణితహారే
ఇహవిహార మదన బహుమానసమరే ॥ 8

సా।రిసరి ॥ మా। పమ గగ ॥ గా। మపదపద ॥ పా। ... ॥
కం। జదల ॥ పిం। జ-రిత ॥ కా। మభ। వ-నే। .... ॥
గగ। మ పదప ॥ గగ। మప దప।- గా। పమగగ రి-సా। ...
ఇహ। విరహ ॥ రహ। సి నవ। కుం ॥ద ర ద ॥ నే। ...
సరి-॥ మాపమ గా ॥ రిసరి। రిసీ ॥ సీ। సరి మాపమ ॥ గా। గరి రీ ॥
సప। ది ... బా లే..। .. ॥ మం। గలని ... ॥ దా। నం .. ॥

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్లోకము :— మానేన విరహం ప్రాప్యాసీ దమానాంమనస్వినీం
శంకరః ప్రణయాదాహగిరిజామ అనురంజయమ్ ॥

అష్టపది :— పంతువరాళి ఆదితాళం

కుసుమవితానితశయనమలంకురు-నిహితపదాస విలాసం
తవపద పద్మ సపత్న సరోరుహ-మిదముపయాత్వ వికాసం।
ఇహనవిధే విహసంతం భవమవలోకయబాలే ॥ 1
అనిల గలితసుమ మలకభరంతవ ధృఢసహనంకల యేహం
నిటలతలే తవ మృగమద తిలకం-మలయజ గంధిక దేహం ॥ 2
పరిహర విరహదమశుభకరం-తవ విఫల మమం హృదిమానం
శృతిసుఖదంతవముఖ కమలోదిత-మయిదయితే కురుగానం ॥ 3
కుచకలశోపరి పత్రలతామయి-విలిఖాం వ్యపనయ చోలం
అనుభవదైతే సహచర సవిధే-ఖేలనమనునయడోలాం ॥ 4
లంబిత పదయుగలే తవకామిని-యోజిత యావకసారం
అంబర మసితద్యుతి రివలంబయ మామవలంబిత హారం ॥ 5
మామయిమధురంతావకమధరం-పాయయపయ ఇవజాలం
వపురి దమబలే కవలయవవృషా-శాఖైరర్జున సాలం- 6
అయిరశనాగుణ ముదితరవం-కురునా నాశింజితభేదం
విహరయథారుచివిగత భయాస్మర-సంజాతం త్యజఖేదం ॥ 7
విలులితచికురం తవముఖకమలం-శ్రమజలకలుషకపోలం
ముహురభివాంఛతి ననుమమ మానస-మువలోకితుమతిలోలం ॥
పంచరత్న కవి భణితమిదం భవ-భక్తజనాభయ దానం
కలయతు గిరిజాపతి పరితోషం-బహుకళ్యాణ నిదానమ్ ॥ 8
పదానిసా సని ద దప। ప పమ గమ। గరిరిస ॥
కుసుమవి తా నిత। శయ-నమ। లంకురు ॥
సనీ సనీ గామరి। గామ పా। దపమప దా ॥
నిహితవ దానవి। లా.. సం। ..... ॥
మదా మదా నీసస। సనిగరి సస ॥ సనిద నిస ॥
తవ పద పద్మస। ప...త్నస। రో..రుహ ॥
దసా నిదా పద ససని। సా..। రిసని దపా ॥
మిద ముపయా-త్వవి। కా--।సం .... ॥
సనీ సరీ గా మమగ రీ పమగరి సా ... ॥
ఇహ సవి ధేవి-హా। సం ....। తం .. ॥
ససా ససా సాని దమద। సనిదప మగమగ। రీసా ॥
భవమవలో .. కయ। బా .... లే... ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడుకొనవలెను)

శ్లోకము :— రమ్యసాను వ నోదేశేశివ శైలస్య కంధరే
క్రీడంతంశివశైలేశం కల్యాణేప్రాహ శంకరమ్ ॥

అష్టపది :— సౌరాష్ట్ర ఆదితాళం

విరచితమండన ఖండన తనుజిత-మన్మథఘటయ యథోచితం
శశిధరశేఖరచంద్రమసం మకు-టేన సుయోజితం ॥ 1

దనుజభయంకర శంకర హారకర-జేన నిజేన భుజాంతరే
నఖపద చంద్రకలాంకురు కుచయుగ-శేగళితాంతరే ॥ 2

మృగమద చందన నిందన కలుషిత-నిటలతలం తిలకాంచితం
పరిహార భీషణభూషణమనుతను-పురహరతవయదివాంచితం 3

కుచయుగశేచ గళేచనిరంత-కుంకుమచందనరోపణం
కలయ విలోలకపోల విచిత్రిత-పత్రవిలేఖన గోపనం ॥ 4

నిత్య నిరంజన భంజనకోపన-లేపన శోభనమంజనం
ననునయనయనే కువలయసదృశే-భువనవిమోహనరంజకం ॥ 5

ఉరసినిరంతరదంతుర హారల-తాపరి కల్పిత కంచుకం
యోచనమోదయలోచనచంద్రిక-యాసుఖముత్సుకచుంచుకం॥6

అనుదిత దూషణ భూషణభూషిత-మాత్మా నంతవఖేలయ
శివశైలే మహేశమనోహర-నిత్యంమామపి వేలయ ॥ 7

శివగిరి వివరే సుచిరే వచనం-కల్పన్యా మృదు సంహితం
శృతిపథమధురంభిదురంవిపదాం-పంచరత్నకవిబృంహితమ్॥8

.దనీ ససా సా ససని। దదని ససని। దద దప ॥
.విరచిత మండన.। ఖం..డన.। తనుజిత ॥
.దసా దపా మగగరి। గమ దదప। దా.. ॥
.మ.న్మథ ఘటమయ। థో..చి.। తం.. ॥
.దనీ సరీ రిషు గరిస। ససని దప। మమగ రిస ॥
.శశిధర శే..ఖర। చం..ద్రమ। సం..మకు ॥
సా.ని దద ససని సరి। గమపమ గరిగరి। సా.. ॥
టే..నసు మో.జి। తం......... ॥
.గమాపా. పపా.మద। దా.ద సనిరి। సా.. ॥
.గిరిజా. జగా..వి। తి.సుం..ద। రే... ॥

.దనీసా. సనిదదప। మగసరిరి। సా.. ॥
.శివశై . ల.సా.ను। కుం...ద। రే.. ॥

(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

అష్టపది :— హమ్మీరుకల్యాణి ఆదితాళం

ఋతు సమ యోచిత కరణ కలాపా
గళిత మదన కృత మానస తాపా
కామ జనితజవాకమనీయరూపా
కామ జనితజవా విహరతి హసిపురరిపుణా ॥ 1

స్మరణ విషయ రతి విఘటిత చోళా
నిహిత చరణ యుగ చలన్నవ దోల ॥ 2

కుచ తట విరసితకోమల హారా
కుసుమ నికర యుత కుంతలభారా ॥ 3

మృగమద సురభిళకలుషకపోలా
పురరిపు నానహ విహరణ లోలా ॥ 4

జఘన విలంబిత గమన విశేషా
మదన విజృంభిత సమర దృగీషా ॥ 5

మందస్మిత యుతవదనసరోజా
కందర్పోత్సవ కలశోరోజా ॥ 6

హంసక హంస పదాంబుజయుగళా
శంభుతనూకృత నిజతను శబలా ॥ 7

పంచరత్న కవి కల్పితకామా
పరమ శివాహిత పంకజ దామా ॥ 8

.నిసా రిసా రిమపప। .మపాదపా। దనిసా ॥
.ఋతుసమయో.చిత। .కరణక। లా.పా ॥
.నిరీ సనీ దదపమ। రీగమ। రీసా ॥
.గళి తమ దనకృత। మానస। తాపా ॥
పా.మ మదపమ గమ। దా..। దదనీస ॥
కా.మజ.నితజ। వా..। కమనీ. ॥

రిసనిని దదపా। పమగమరీ। సా.. ॥
.యరా...పా।......।... ॥
.మపద పమగమ। రిరిసని। సా. ॥
.విమరతి రమసి। పురరిపు। ణా.. ॥
(తక్కిన చరణములన్నీ ఇట్లే పాడవలెను)

శ్రీ అత్రికులతిలకాయమానానన్తయజ్వ కులకలశసింధు
కౌస్తుభాయమాన కృష్ణదీక్షితతుర్యతనయ
మృత్యుంజయార్యతమసంభ
వానంతనారాయణనామధేయ
పంచరత్నకవికృతం
గీతశంకరం
సమాప్తమ్

---

## శ్రీ గీతగోవిందములోని అష్టపదులకు ప్రాచుర్యంగా ఉన్న రాగతాళాలు

| పేజీ | అష్టపది | ముద్రితరాగం | ముద్రితతాళం | ఇతరరాగతాళాలు | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రళయపయోధిజలే | మియామల్హార్ | ఏకతాళం | మాళవ | రూపక |
| 3. | ప్రశ్రితకమలా | భీంపలాసీ | రూపక | భైరవి | త్రిపుట |
| | | | | ఘూర్జరి | నిస్సార |
| 4. | లలితలవంగ | బసంతబహార్ | ఏక | వసంత | ఆది |
| | | | | | యతి |
| 6 | చందనచర్చిత | తిలంగ్ | ఏక | రామక్రియ | యతి |
| 8. | సంచరదధర | తోడి | త్రిపుట | ఘూరరి | యతి |
| | | | | తోడి | ఆది |
| | | | | ధన్యాసి | ఆది |
| | | | | దేశాక్షరి | ఆది |
| 9. | నిభృతనికుంజ | ఆహెరిభైరవ్ | ఏక | గుణక్రియ | ఏక |
| | | | | మాలవగౌడ | ఏక |
| 12. | మామియం | భూపాలతోడి | త్రిపుట | భూపాల | ఆది |
| | | | | ఘూర్జరి | యతి |
| 15. | నిందతిచందన | బాగేశ్వరి | ఏక | కర్ణాట | ఏక |
| | | | | సౌరాష్ట్ర | ఏక |
| | | | | కానడ | ఏక |

| పేజీ | అష్టపది | ముద్రితరాగం | ముద్రితతాళం | ఇతరరాగతాళాలు | |
|---|---|---|---|---|---|
| 16. | స్తనవినిహితమపి | పట్ దీప్ | ఏక | దేశాక్షరి | ఏక |
| | | | | దేశాఖ్య | ఏక |
| 19. | వహతిమలయ | పీలూ | రూపక | సంతువరాళి | రూపక |
| | | | | దేశాక్షరి | రూపక |
| | | | | దేశవరాళి | రూపక |
| 20. | రతిసుఖసారే | భైరవి | ఏక | ఘూర్జరి | ఏక |
| | | | | పాడి | ఏక |
| 23 | పశ్యతిదిశిదిశి | బృందావనసారంగ్ | ఏక | గుండక్రియ | రూపక |
| | | | | శంకరాభరణ | రూపక |
| | | | | గుణకరీ | రూపక |
| 25 | కథితసమయేఽపి | ఆహిరిభైరవ్ | ఝంపె | మాళవ | యతి |
| | | | | ఆహిరి | జంపె |
| 26. | స్మరసమరోచిత | సారంగ | త్రిపుట | వసంత | యతి |
| 27. | సముదితమదనే | సావేరి | చాపు | ఘూర్జరి | ఏక |
| 29. | అనిలతరళ | పీలూ | ఆది | పున్నాగవరాళి | ఆది |
| | | | | దేశవరాళి | రూపక |
| 31. | రజనిజనిత | భీంప్లాసీ | ఆది | భైరవి | ఆది |
| | | | | భైరవి | యతి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 33. | హరిరభిసరతి | సింధుభైరవి | ఆది | యదుకులకాంభోజి | ఆది |
| | | | | రామకరి | ఆది |
| | | | | ఘూర్జరి | యతి |
| 35. | వదసియది | దేశ్ | ఆది | దేశివరాళి | మధ్యమాది |
| | | | | ముఖారి | జంపె |
| 39 | విరచితచాటు | యమన్ | ఆది | మోహన | ఆది |
| | | | | కళ్యాణి | చాపు |
| | | | | వసంత | యతి |
| 40. | మంజుతర | కాపీ | ఆది | బంగాళవరాళి | రూపక |
| | | | | ఘంటా | జంపె |
| 41. | రాధావదన | దుర్గా | ఏక | మాళవ | ఆది |
| | | | | మధ్యమావతి | ఆది |
| | | | | వరాళి | యతి |
| 44. | కిసలయశయన | విభావ | ఏక | విభావ | ఆది |
| | | | | నాదనామ | ఏక |
| | | | | విభావ | ఏక |
| 46. | నయనకురంగ | లలిత | ఏక | మంగళకౌశిక | చాపు |
| | | | | రామక్రియ | యతి |

## గీతశంకరములోని అష్టపదులకు ముద్రిత తదితర రాగతాళాలు

| పేజీ | అష్టపది | ముద్రితరాగం | ముద్రితతాళం | ఇతరరాగతాళాలు | |
|---|---|---|---|---|---|
| 51. | శమితజగత్రితయే | మాయామాళవగౌళ | ఆది | మాలవి | ఆది |
| 54. | మలయానిల | పంతువరాళి | చతు్శ్రఏ: | రామక్రియ | ఆది |
| | | | | పంతువరాళి | ఆది |
| 55. | శంబర వైరి | దేవగాంధారి | చతు్శ్రఏ: | పంతువరాళి | ఆది |
| 65 | గంళమలి | ముఖారి | ఆది | ముఖారి | ఆది |
| | | | | వరాళి | ఆది |
| 69 | అనుదిన మరుణ | కల్యాణి | ఆది | సాళగ భైరవి | ఆది |
| 72. | కుంజపల | ఘంటారవం | ఝంపె | దేశవరాటి | ఝంపె |
| 74. | విరచితమండన | సౌరాష్ట్ర | ఆది | మంగళకౌశిక | ఆది |

# శ్రీ గీతగోవిందములోని అకారాది పద్యానుక్రమణిక

## గీతశంకరములోని అకారాది పద్యానుక్రమణిక

———

శృంగారపదములు

(పాటలు - పద్యాలు)

ఇందుమతీ పరిణయము

(ప్రబంధము)

ప్రచురణలపై

# ప్రముఖ పండితుల అభిప్రాయములు

డా॥ దివాకర్ల వేంకటావధాని
ఆంధ్ర శాఖాధ్యక్షుడు
ఉస్మానియా విశ్వ విద్యాలయము

వాఙ్మయ మహోధ్యక్ష
కళాప్రపూర్ణ
శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి
Joint Director, oriental Manuscripts
Library and Research Institute
Hyderabad-12 (A. P.)

నమస్కారములు.

తాము దయతోఁ బంపిన ఇందుమతీపరిణయప్రబంధము, శృంగార పదములు, రాధావంశీధర విలాసనాటక్ అను హిందీయక్షగానము అను మూఁడు గ్రంథములును జేరినవి ఇందుమతీ పరిణయమునకు ముందు తాము రచించిన తొలిపలుకు చదివితిని. తాము ఏడవ వైవస్వత మన్వంతరములోని పంచమ మహాయుగమునందలి త్రేతాయుగములో శ్రీరాముడవతరించినట్లును, రామభద్రకవి యిందుమతీ పరిణయమును రచించుటకుఁ బూర్వము రచించిన తరువాతను గాక రచించుచున్న సమయమందే కృష్ణభూపతి ఆ ప్రబంధమును తన కంకితమిమ్మని అడిగినట్లును, కవి కృష్ణభూపతి వంశమును వర్ణించుచు విష్ణుపాదాదిగా నాల్గవజాతిని పేర్కొనుట అతని ఆక్షవిజ్ఞానలోపమును సూచించుచున్నట్లును తెలిపిన విషయములు యుక్తముగానున్నవి. కాళిదాసు కావ్యములు మూఁడును విశిష్టశ్లిష్ట కావ్యములనువిషయమును జిజ్ఞాసువుల యెఱుకకై తామొక గ్రంథముగా రచించుట యుక్తముగా నుండును సమ్మోహనాస్త్రమును గురించి తాము వివరించిన ఆస్త్రవిజ్ఞాన విశిష్టమైన పరిశోధన అద్భుతముగా నున్నది అట్లే తాము తెల్పిన ఛందోబంధవిశేషము లపూర్వములై కూలంకషమైన తమ ఛందశ్శాస్త్ర పరిజ్ఞానమును వెల్లడించుచున్నవి. చంపను లేఖకు లెవరో చాపగా వ్రాయుటవలనఁగలిగిన పొరపాటును తాము చక్కగా సూచించి యున్నారు. ఆ దిద్దుపాటు యుక్తియుక్తముగా నున్నది.

శృంగార పదములకు తాము రచించిన విపుల విజ్ఞానవంతమైన పీఠికను పఠించి ఆశ్చర్య చకితులు కానివారుండరు పదమనగా పాట అనియు, పద్యమనగా వృత్తమనియు లోకమున పండితులు సైతము తలంచుచుండుట పరిపాటిగా నున్నది తాము ప్రమాణ నిదర్శన హేతువాద పూర్వకముగా పద్యశబ్దముచేత మాత్రాబద్ధములైన పదములు కూడా గ్రాహ్యములగునని నిరూపించిన తీరు అప్రత్యాఖ్యేయమై అద్భుతముగా నున్నది తాముదహరించి జూపిన ప్రమాణము లసంఖ్యాకములై అందలి యాథార్థ్యమును వేయి విధముల నిరూపించుచున్నవి పదశబ్దమును తాము వివరించిన తీరు యుక్తియుక్తముగా నున్నది. పాద, చరణ, శబ్దములు పర్యాయ

పదములే యైనను చరణములందు ప్రాసములుండునని తెలిపిన విషయము నాకు నూతనము. ద్విపదాదులు కూడ శుద్ధ దేశీయములు కావను విషయమును తాము చూపిన ప్రమాణములను దిలకించిన తరువాత నెవ్వరును కాదనఁజాలరు. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమున కానఁబడు ఛందస్సంగీత శాస్త్రముల సమన్వయమునకు సంబంధించిన అవగాహన పూర్వకమైన అసమగ్రతను తాము సప్రమాణముగా ప్రదర్శించియున్నారు. వృత్తాఖ్య వృత్తములను గూర్చియు పదమనఁగా కేవల శృంగార పదము మాత్రమేకాదను విషయమును గూర్చియు, తెలుఁగునందలి పద వాఙ్మయమును గూర్చియు, శృంగారపదములయు, సీసములయు కర్తృత్వమును గూర్చియు, ధాతుమాతావులను గూర్చియు, మహారాష్ట్ర రాజుల చరిత్రను గూర్చియు, వారిలో కొందఱి తెలుఁగుదనమును గూర్చియు తాము తెల్పిన యంశములు పరిశోధన పూర్వకములై అపూర్వకములుగా నున్నవి. తమ పీఠిక విమర్శ వాఙ్మయమునకొక నూతనాలంకారము.

తమ యాజమాన్యమున సముద్రితములైన గ్రంథములింకను తమ అపూర్వములైన పీఠికా వివరణాదులతో వెలువడి ఆంధ్రవాఙ్మయమున కభినవ సౌందర్యమును సమకూర్చుగాక యని యాశించుచున్నాను.

విధేయుడు

*దివాకర్ల వేంకటావధాని.*

౨

# శృంగారపదములు

పదకవితాశాఖ పద్యకవితాశాఖ యని రెండు విధములుగా ప్రవర్తిల్లుచున్న తెలుగు సాహిత్యమున నింతవఱకు, పద్యకవితాశాఖను గూర్చియే పరిశ్రమ జరిగినది గాని పదకవితాశాఖ యందంత పరిశ్రమ జరుగలేదు ఆంధ్రవాఙ్మయ చరిత్రమున పద్యకవితాశాఖకే ప్రాధాన్యముగాని పదకవితకు స్థానములేదు. పద పద్య కవిత లలో, పద్యకవిత కంటె పదకవితయే ముందని సాహిత్య విమర్శకులు సారస్వత చరిత్రకారు లంగీకరించినదే-అయినను పద్యకవితయందు పండితులకు గల యభిని వేశము, పదకవితయందు లేకపోవుటచేత, పదకవితలను గూర్చి పరిశ్రమ యిప్పటికి నలువదేండ్ల క్రిందటనే ప్రారంభమైనను, ఉత్తమ సాహిత్య విమర్శనా పథకమున పదకవితకు స్థానము లేకపోయినది-సమగ్రాంధ్ర వాఙ్మయ పరిణామ చరిత్రకు, పద కవితల పుట్టుపూర్వోత్తరములు, పదకవితా తత్త్వము, పదకవితా వికాసము నత్యంతావశ్యకములు-అట్టి పదకవితను గూర్చి పరిశ్రమ చేయుటకు ననేకవిధము లుగా దోహదముచేయునది ప్రస్తుతము ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారు ప్రకటించిన

శృంగారపదములు

అను గ్రంథము-ఈ గ్రంథమునకు వాఙ్మయ మహోధ్యక్ష కళా-ప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి ఏబది నాలుగు పుటల పీఠిక పదకవితా వాఙ్మయ చరిత్రకే పీఠికగా నున్నది.

ఈ శృంగారపదముల మాతృక తంజావురిలోనె సరస్వతీ మహాలు గ్రంథా లయమున కలదని శ్రీ గోపాలకృష్ణయ్యగారు తెలిపినారు-ఈ సందర్భమున వారు పదములను గూర్చి 40 గ్రంథములున్నవని తెలుపుచూ, వాని గ్రంథ సంఖ్యావివర ములనిచ్చినారు-ప్రస్తుత ముద్రణము అందుగల **B. C/632** ప్రతి **M. 136** అనుప్రతి ఆధారముగా ముద్రితమైనది పీఠిక * (పుట ౩౮)

ఈ గ్రంథ ప్రకటనము వలన సాహిత్యలోకమున కెంతో మేలు కలిగినది అది యీగ్రంథపీఠిక-ఈ పీఠికలో కళా-ప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి వఱకు, సాహిత్య విమర్శకులు, పద వాఙ్మయ చరిత్రకారులు నెఱుగని, యపూ ర్వాద్భుత విషయములు, శాస్త్రీయముగా సోపపత్తికముగా చర్చించియున్నారు. మొదటిది.

* కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి బసవపురాణ పీఠిక (1929) మూలము నను, చిలుకూరి నారాయణరావుగారి పండితారాధ్య చరిత్ర మూలముననను, పద కవితలను గూర్చి పరిజ్ఞానము తొలుత సాహిత్యలోకమునకు గలిగినది.

## 1. పదము—నిర్వచనము

పదమంటే లోకములో వాడుక ప్రకారము పాట అని, పద్యమంటే ఛందో విశేషమని వ్యవహరించుట కలదు. ఇంతేకాదు, అక్షరచ్ఛందస్సులకు సంబంధించిన వన్నియు పద్యములని లాక్షణికులు నిర్వచించినారు. వారే మాత్రాచ్ఛందస్సులైన-తరువోజ ద్విపద సీసాక్కరాది ఛందస్సులను-పద్యములనియే చెప్పినారు-అయినను పదములు గేయములుగా నుండునవన్నియు మాత్రాచ్ఛందస్సులే. అప్పుడు మన ఛందో లక్షణకారులు *పద్యములుగా* చెప్పిన పై మాత్రా చ్ఛందస్సులన్నియు పదములే. కాబట్టిపద్యశబ్దముచేత,మాత్రాబద్ధములైన గేయములుగ్రాహ్యములవుతవి.

ఇంతవఱకును, మనము పదము వేఱు పద్యము వేఱు అని భావించుచున్నాము. కాని నేడు గోపాలకృష్ణయ్యగారు, బహుసూక్ష్మముగా పరిశీలించి, పద, పద్యములు, పర్యాయపదములుగా వాడవచ్చునని నిరూపించినారు. ఇందుకు తార్కాణంగా, ప్రస్తుతము ప్రకటితమైన శృంగారపదములే చూపవచ్చును. ఇందులో పదములే కాక శృంగారపదములు అను శీర్షికగల రెండవ భాగములో అన్నియు *పద్యములే*. దీనికి మూలమైన తాళపత్ర ప్రతిలోనివి-"పదములు" గానే చెప్పబడినవి గాని పద్యములుగా చెప్పబడలేదు-పాఠకులకు స్పష్టముగా తెలియుటకై మూలము తాళపత్ర ప్రతినుండి చూపుచున్నాను.

### ప ద ము లు

M. 136.S $\frac{148}{10} \times \frac{12}{10}$ L. 22.11.4.5. G. 140

**Beginning**

సీ. చేరియింకొకసారి చిన్నారి నెమ్మోము
కన్నులు చల్లగాఁ గంద నోక్కొ
తెలియనింకొకసారి తియ్యని పలుకులు
వీనుల విందుగా విందునొక్కొ.

**End**

వేగమరు కేళినలయించి వేడ్కమించి !
ముదమున చెలంగి యేలవె మోహనాంగి.

### 8. పదములు

* వృత్తాలు గణ, సమకబద్ధాలు-జాతులు మాత్రా, సమకబద్ధాలు అని కవి జనాశ్రయకర్త నిర్వచించినా గణసమకబద్ధాలతో-అక్షర సమత్వము లోపించునని గోపాలకృష్ణయ్యగారు రాముడు-భర్గుడు-అన్న గణములను ఉదాహరణముగా చూపినారు. ఈ సందర్భములో వారు, సీస పద్యమునందలి మాత్రాగణములను తీసికొని-"నల" "భ" గణాలు మాత్రమేగాని, "నగ" "రత" లు మాత్రమే గాని ప్రయోగించి ఆ తరువాత సూర్యగణాలు ప్రయోగిస్తే సమమాత్రకాలు కావచ్చునని నిరూపించినారు-ఆటవెలదితప్ప మిగిలిన జాతులన్నీ సమమాత్రక గణాలు కలవిగా మాత్రమే కాదు సమగణాలు కలవిగా ఉండేటట్లు కూడా రూపొందించవచ్చు అని విశదముచేసినారు.

* పద్యానికైనా గేయానికైనా 'పదము' అని వాడవచ్చును.

అక్షరచ్ఛందస్సులైన వృత్తాలలో గురు లఘుక్రమములో వ్యత్యస్తత వుండ రాదు–అనగా రెండు లఘువులొక గురువుకాదు–గురువు గురువే–లఘువు లఘువే. ఈ యంశము వ్యక్తపఱచుటకు–వారు, గేయాలలో "పల్లవి" అను పల్లవి విడిచి పెడితే, చరణాలలో–సమమాత్రాకత్వ–అసమ మాత్రాకత్వ గణ సమకత్వాలలో, ఏదో ఒకటి గోచరము కాక తప్పదు–ఇందువలన–గేయ రచనాచ్ఛందములో జాత్యుపజాతులలో చక్కగా నిముడును–అందువలన పదములను, పద్యములన్న దోషము లేదు. భరతముని మతమున పాటపాడుట, పద్యము చదువుట అని లోక వ్యవహార మున్నను పద్యము కూడ పాడవచ్చును, చదవవచ్చును, అని వాల్మీకి రామాయణము నుండి ప్రమాణపూర్వకముగా నిరూపించినారు. పద్యములను, రాగములతో పాడు సంప్రదాయము మనకు చిరకాలమునుండి సంప్రదాయసిద్ధమై యున్నది. పురాణములు శ్రీరాగముతో చదువవలయునని నియమము గలదు. వసుచరిత్ర యందలి, కొన్ని పద్యములలో, సందర్భానుసారముగా నుపయోగింపబడిన పదములాయా రాగములను నిరూపించి ఆయా పద్యముల నాయా రాగములతో పాడవలయుననియే రామరాజభూషణుడట్లు రచించెను–

"నానాసూన వితాన వాసనల"–అన్న పద్యమున "సారంగమేలా నన్నొల్ల దటంచు" అన్న "సారంగ" పదము, సారంగ రాగమును సూచించును–అనగా ఆ పద్యము సారంగ రాగముతో పాడవలెను–తక్కిన, కాంభోజీ, హిందోళ మొదలగునవి–స్పష్టముగా పద్యమందున్నవే.

పద్యములు రాగముతో పాడవలెనన్న సంప్రదాయము నాటకములయందు, మన కవులు పాటించిరి. ధర్మవరమువారి చిత్రనళీయమున–ఇచ్ఛాపురపువారి రసపుత్రవిజయమున పద్యములతో రాగముల పేర్లు పొందుపఱుపబడినవి. నటకులాయారాగముల నా పద్యములను పాడుచుండెడివారు–ఒక సీసపద్యమున నాల్గు పాదములు నాల్గు రాగములున్నప్పుడిట్లే నాల్గు రాగములు పాడెడివారు

వృత్తములుగాని కంద పద్యములుగాని – అనుప్రాసలతో నున్నప్పుడు వానిని తాళములతో పాడవచ్చునని–భాగవతమునుండి పద్యములు తాళములతో పాడి పురాణ హరికథగా కీ. శే. బంకుపల్లి మల్లయ్య శాస్త్రులవారు వినిపించెడివారు[1] (1876–1946).

పద్యములు పాడడము అన్న విషయమీనాటి వారికపరిచితము. అట్టిదానిని సాహిత్య విమర్శకులదృష్టికి తెచ్చినందులకు శ్రీ గోపాలకృష్ణయ్యగారి నెంతయేని యభినందింపదగియున్నది

పదశబ్దచర్చ–వాఙ్మయ ప్రపంచమున నింత శాస్త్రీయ దృక్పథముతో, నిశిత పరిశీలన యింతవఱకు నెవ్వరును చేయలేదు ఇందన్నియు నిదివఱకు లోకమునకు

---

1. వీరు భాగవత పద్యములను విశాఖపట్టణమున–1935 కవితాసమితి సమ్మేళనము వినిపించునపుడు, విను భాగ్యము నాకు లభించినది. ఈ విషయము నా "పోతన" అను గ్రంథమున తెలిపినాను. (చూ. పుట 102)

పరిచితము కానివే-పదశబ్దము వేదమున గలదని నిరూపించుటయేగాక-ద్విపదలకు "ద్విపథ" అని వ్యవహారమున్నట్లు శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరములో తెల్పెనన్న విషయము సంగీత, సాహిత్య శాస్త్రపరిశోధకులకందఱికి కనువిప్పు.

పదమేకాక, గీతము, పదకవిత వీనిని గూర్చి అపూర్వ విషయము లిందు గలవు శ్రీ దివ్య తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులగు, తాళ్లపాక అన్నమయ్య గారు పదకవితా సార్వభౌములై, సంకీర్తన లక్షణము నెందులకేర్పరిచినారో అన్న విషయమందు, శాస్త్రరీత్యా, సమన్వయము చేయబడినది అన్నమయ్యగారి కాలము నాటికే "పద విజ్ఞానాంధులున్నట్లును" పదవాఙ్మయము యొక్క ఉత్తమస్థాయిని నిరూపించి, దానిని సాహిత్య చరిత్రమున సుప్రతిష్ఠితము చేసిన విచారణ యీ పీఠికకు, మెఱుగులు దిద్దుచున్నది.

అన్నమయ్యగారు సంకీర్తనలక్షణములో ప్రారంభమున పదమును గుఱించి భరతనాట్య శాస్త్రమున 15వ అధ్యాయమున వివరించిన శ్లోకము లిందు తాత్పర్య ముతో నిచ్చుటచే-పదమును గూర్చి-నిర్దిష్ట పరిజ్ఞానము సలవఱచుకొనుట కెంతయో తోడ్పడుచున్నది

* అన్నమయ్య సంకీర్తనలక్షణమున కింతవఱకు వ్యాఖ్యావివరణ పూర్వకమైన సాధికార ముద్రణలేదు అట్టిది చేయుటకు శ్రీగోపాలకృష్ణయ్య గారికి తప్ప యితరు లకు సాధ్యము కాదేమొ ? కాని వారు ప్రథమముగా పాఠకలోకమున కిందుగర్భిత మైన గంభీర విషయములు ప్రదర్శించుటచే, దానినిగూర్చి యితరులు పరిశోధన చేయుట కవకాశము కల్పించినారు.

స్థాలీపులాకన్యాయముగా నిందలి విషయములు కొంతవఱకు ప్రదర్శించితిని ఇంకను ఇందలి "వృత్తాఖ్య వృత్తత్వం సార్వత్రికం" అన్న శీర్షికలో ఉక్తాత్యుక్తాది యిరువదాఱు ఛందస్సులలో మొదటి ఛందస్సునుండి ఎట్లు క్రమక్రమముగా నిరువదారు రూపొందినవో యిందు సోదాహరణపూర్వకముగా వివరింపబడి నవి. ఇంతవఱకు ఛందశ్శాస్త్రమునుగూర్చి యెన్నో గ్రంథములు వెలువడినవి. కాని యింతవఱకు, నీ విషయమై ఎవ్వరూ స్పృశింపనేలేదు దీనికి హేతువులేదు. ఇట్టి వివరణకు కేవలము ఛందశ్శాస్త్రము పరిణత ప్రజ్ఞయున్న చాలదు. సంగీత శాస్త్రమునందు, వైదిక ఛ్ఛందస్సునందు, నిష్ణాతులైనవారే యిట్టి పనిచేయుటకధి కారము గలవారు. శ్రీ గోపాలకృష్ణయ్య గారట్టివారు కావుననే యీ పీఠికలో

---

* తిరుమల తిరుపతి దేవస్థానమువారు 1935 లో ప్రచురించిన మూలము తప్ప వేఱు ముద్రణ దీనికింతవఱకు లేదు ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమి వారు దీనిని విస్మరించిరి.

నిట్టిలోకోత్తర విషయమును ప్రథమముగా, ఆంధ్రని పండిత లోకమున కందించినారు. ఇట్లొక్కొక్క విషయముగూర్చి చర్చించిన గ్రంథ విస్తరమగునని విరమించు చున్నాను

శ్రీ గోపాలకృష్ణయ్యగారి పీఠికలలో నిట్టి యద్భుత విషయములుండుటలో ఆశ్చర్యములేదు. వారి రచనలలో ప్రత్యేకతయే యిట్టిది ఆయన ప్రతి విషయమును బహుముఖములుగా లోతుగా పరిశీలించిన గాని బయటపెట్టరు సాహిత్యమందేగాక, ఇతర శాస్త్రములందును వారికి గల వ్యక్తిత్వమీవఱకే వివరించినాడను. *

శ్రీ గోపాలకృష్ణయ్యగారి పీఠికయందలి పదవాఙ్మయమునుగూర్చి విషయములన్నియు ప్రత్యేక గ్రంథముగా రూపొందింతురు గాక – యని – విన్నవించుచూ నీ గ్రంథసమీక్ష ముగించుచున్నాను

పద వాఙ్మయ పరిశోధకులు సాహిత్య విమర్శకులు నీ పీఠిక యందలి విషయములను, అధ్యయనముచేసి పదవాఙ్మయమును గూర్చి పరిశోధన చేయుదురు గాత.

*నిడుదవోలు వెంకటరావు, హైదరాబాదు.*

---

* వాఙ్మయ మహోపాధ్యాయుని పరిశోధనా వాఙ్మయం. జాను తెనుగు-నానుడి. 7వ పుట.

౩

## ఇందుమతీ పరిణయము

తెలుగువారి కింగలకు చిరపరిచితుడగు తెనాలి రామకృష్ణకవితమ్ముని పనుమడు రామభద్రకవి రచించిన ఇందుమతీ పరిణయము, ఇంతకుముందెవరో కొంతమంది పరిశోధకులకు తప్ప తక్కినవారికి తెలియనే తెలియదు. ఇంతవఱకు ముద్రితముగాక, మఱుగున పడియున్న యీ ప్రబంధమును నేడు ఆంధ్రప్రదేశ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము పరిశోధనా సంస్థవారు (ఆంధ్రప్రదేశ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్ వారు) సర్వాంగ సుందరముగా ప్రకటించినందులకు వారినెంతయు నభినందించుచున్నాము

ఈ గ్రంథము డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారిచే పరిష్కృతమై 14 పుటల ఉపోద్ఘాతముతో నొప్పుచున్నది – వాఙ్మయ మహోధ్యక్షు, కళా–ప్రపూర్ణ వక్లమూడి గోపాలకృష్ణయ్యగారి 24 పుటల తొలిపలుకు గలదు.

ఈ కావ్య మింతవఱకు అపరిచితమగుటచేత నిందలి వివరములు తెలుపుచున్నాను. ఇది 4 ఆశ్వాసముల కృతి–

| | |
|---|---|
| ప్రథమాశ్వాసమున — | 146 |
| ద్వితీయా ,, | 113 |
| తృతీయా ,, | 152 |
| చతుర్థా ,, | 256 |
| | 667 గద్యపద్యములు గలది |

ఇందిరువదియారూఱు గద్యములు – అనగా వచనములు మాత్రమే గలవు అందు రెండు మాత్రమే పెద్దవి తక్కినవి అంత – అప్పుడు వంటి చిన్న వచనములు కాబట్టి ప్రాయికముగా నిది పద్య ప్రబంధమని చెప్పవలెను.

తెనాలి రామభద్రకవి విరచితమైన ఇందుమతీ పరిణయమును గూర్చి మొదట తెలిపినవారు కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణకవి మహోదయులు ఇప్పటికి ఏబది యెనిమిదియేండ్ల క్రిందట 1914లో ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వారు "తెనాలి కవులు" అను వ్యాసము ప్రకటించి, అందు రామభద్రకవి గ్రంథమే గాక, తెనాలి కవులను గూర్చి, ఎన్నో క్రొత్త విషయములు తెలిపినారు (ఈ అమూల్య వ్యాసము "మానవల్లి సంచిక" అను గ్రంథమున పునర్ముద్రితమైనది ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి ప్రచురణ సంపాదకులు – నిడుదవోలు వెంకటరావు – డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు.)

ఉపోద్ఘాతమున కావ్యవిశేషములనుగూర్చి గాని అపురూప పద ప్రయోగములు గూర్చిగాని – ఏమియు చర్చింపబడలేదు – తెలుగు భాషలో ఇందుమతీ

పరిణయము లెన్నియున్నవి ? వానిలో రామభద్రకవి కృతి కాలక్రమమును ననుసరించి యెప్పటిది - అను విషయములే యిందు లేవు ప్రస్తుతము లభ్యములైన యిందుమతీ పరిణయములలో, కుమార ధూర్జటి ముద్రితమై వ్యాప్తిలోనున్నది * పరిష్కర్తలు, కుమార ధూర్జటి కృతితో దీనిని తులనాత్మక పరిశీలనచేసి రామభద్ర కవి కృతిలోని ప్రత్యేక విశిష్టత వెల్లడించవలసియుండెను.

ఈ గ్రంథ పరిష్కరణ విధానమెట్లున్నను, దీనికి కళాప్రపూర్ణ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్రాసిన తొలిపలుకు గ్రంథమునకు గల కొన్ని విషయములను గూర్చి యనేక నూతనాంశములు వెల్లడించుచున్నది.

1. ఇందుమతీపరిణయగాథ అతి పురాతనమైన పురాణ కథలలో నొకటి. అజ మహారాజు మనుమడైన శ్రీరాముడు మనమనుకొను త్రేతాయుగములో కాక, 28 చతుర్యుగాల పూర్వమున్న చతుర్యుగంలో త్రేతా యుగమున నున్నాడు.

2. కాళిదాసు కుమారసంభవ, మేఘ సందేశాలతోపాటు-రఘువంశ కావ్యం కూడా విశిష్టశ్లేష కావ్యమే.

3 ఆధ్యాత్మిక దృష్టితో చూచినపుడు - అజుడు మామూలు అజుడుకాడు- మహత్తరమైన అజుడు కాలరూపమైన అజముహూర్తం పరమహంస పదమైంది "సోహం - హంసః" అన్న మూలస్వరూపానికి ప్రతిబింబం .................. ఇందుమతి - ఇందు శక్తి - మతిగా రూపొందిన శక్తిస్వరూపిణి

దైహికమై లౌకికమైన నామరూపాదులున్నా, అవి అలౌకిక శక్తి స్వరూప చేష్టావలయంలోవే కాని తద్భిన్నాలు కావు. (4వ పుట)

కాళిదాసుని కావ్యాలలో నిగూఢమై మహాగంభీరమైన, యిట్టి అపూర్వ విషయాలను వివరించుటకు ఆత్మవిజ్ఞానము నామూలాగ్రముగా నాకళించుకొన్న గోపాలకృష్ణయ్యగారికి దప్ప యితరులకు సాధ్యముకాదు.

## వర్ణవ్యవస్థ

ఇందుమతీపరిణయ కృతిభర్త పాలచూరి కృష్ణభూపాలుడు చతుర్థ కులజుడు అన్నదానిని పురస్కరించుకొని గోపాలకృష్ణయ్యగారు, వర్ణవ్యవస్థ నిజస్వరూపమును, వేదోక్త ప్రమాణములతో నిరూపించినారు వర్ణవ్యవస్థమూలతత్త్వము నెఱుగుటకు మన సాహిత్యమున నకాండ తాండవము చేయుచున్న వర్ణవిభేదములను, వివాదములను నశింపజేయుటకు నిందున్న నాలుగు పుటలను సంస్కారముగల వారందఱు చదువుకొని మననము చేయవలసినవి.

తెలుగున ఇందుమతీ పరిణయాలలో, మతుకుమల్లి నృసింహకవి అజచరిత్ర మిక్కిలి ప్రౌఢమైనది

---

* వీనిని శ్రీ గోపాలకృష్ణయ్యగారు తమ తొలిపలుకులో తెలిపియున్నారు.

## సమ్మోహనాస్త్రం

కథలో గంధర్వుడైన ప్రియంవదుడు అజునికి సమ్మోహనాస్త్రము నిచ్చి, ప్రయోగోపసంహారములను మంత్రపూర్వకముగా నుపదేశించును ఈ శీర్షికలో శ్రీ గోపాలకృష్ణయ్యగారు వ్రాసిన, మంత్రశాస్త్ర సంబంధములైన మహాగంభీర విషయములు చూచిన, వారికి మంత్రశాస్త్రమునందుగల మహా వైదుష్యము వ్యక్తమగుచున్నది. ఇందుపయుక్తములైన – అజ, ఇందుమతి, విదర్భ శబ్దాలు బీజాక్షరపరమైనవి–అని కాళిదాస హృదయమును లోతుగా పరిశీలించి శ్రీ గోపాలకృష్ణయ్యగారు వెలుగునకు దెచ్చిన విషయములు వ్యాఖ్యాతలు కూడ తెలుపలేదు ‡ ఈ శీర్షికను బట్టి చూడగా, కాళిదాసకృతులు, మంత్రశాస్త్రదృష్ట్యా ఎంత సూక్ష్మాతిసూక్ష్మముగా పరిశీలింపవలెనో తెలియగలదు. ఇదియును మన మవగాహనము చేసికొనవలసిన శీర్షిక *

## ఛందోవిశేషములు

పరిష్కర్తల ఉపోద్ఘాతములో కవి ఛందోవిషయములను గోపాలకృష్ణయ్యగారు తెలిపినారు

పృథ్వీవృత్తమునకు లాక్షణికులు 12 వ అక్షరము చెప్పగా–రామభద్రకవి తొమ్మిదవ అక్షరాన్ని యతి పాటించాడు. అని "సురేంద్ర రమాపమానిత సతీశ యశోధిరా" (1–146) ఉదహరించినారు పృథ్వీ వృత్తమునకు, 9 వ అక్షరము యతి శ్రీనాథుడు పాటించినాడు

చతుర్ముఖ విలాసినీశయ విలాస పంకేరుహా
ప్రసూతామృతమధూళికా సురభిసార సారస్వతా–నైష 2–146

ఇది సంస్కృత సంప్రదాయము "వసుగ్రహ యతిశ్చ పృథ్వీ" రామభద్రకవి శ్రీనాథుని యనుసరించినాడు

కవిరాజవిరాజిత వృత్తము :–8, 14, 20 మూడుయతులను లాక్షణికులు చెప్పిరి–ఇందు రామభద్రకవి

"స్థిరగుణభూషణ బాంధవపోషణ శ్రీకరభాషణ మేరుధృతీ" (3–15) అని 14 వ యక్షరము నొక్కచోటనే యతి పాటించినాడు. ఇది నన్నయ సంప్రదాయము

చని చని ముందట నాజ్యహవిర్ధృత–సౌరభధూమలతాతతులన్ (ఆది 4–21)†

---

‡ మంత్రశాస్త్రమున శ్రీ గోపాలకృష్ణయ్యగారద్భుత కృషిచేసినారని నాకు తెలియును.

* ఇక్కడ కేవలము రసైకమని మనము భావించు కాళిదాసుని మేఘసందేశము యోగము. శివతత్త్వము పూర్తిగా నిరూపితములైనవి. ఇవి వ్యాఖ్యాతలు తెలుపనివి. చూ–షట్పదీ మేఘసందేశము—నా పీఠిక.

† రామభద్రకవికి పూర్వమే పెక్కు లక్షణ గ్రంథాలవతరించాయి అందువల్ల లక్షణగ్రంథాల ననుసరించక పోవడం నిర్దిష్టమైనది. (వ గో కృ.)

## బంధాలు

తెలుగున బంధకవిత్వమును గూర్చి గోపాలకృష్ణయ్యగారు ప్రస్తావించి, ఇరుమదీపరిణయములోగల బంధములను మూడింటిని గూర్చి వారెంతో శ్రమచేసి మనకు వానిని వ్యక్తము చేసినారు. వ్రాతప్రతిలోనున్న వానినెంత పరిశీలన చేసి వీనికి రూపము లిచ్చినారో యీ క్రిందివానిని గూర్చి తెలియగలుగును..

1. పుష్పమాలికాబంధము :- పద్యములోనున్నది. ఈ బంధస్వరూపవర్ణచిత్రము చూచిన పద్యమునందెంత నిపుణముగా నిమిడ్చెనో తెలియగలదు.

2 పద్మబంధము — వ్రాతప్రతిలో పద్మబంధమని సూత్రమే యుండగా, దానిని చతుర్దళ పద్మబంధముగా ఊహించి, ఎంతో అసహజముగా నున్నదనో గోపాలకృష్ణయ్యగారు, చిత్రములో చూపి, దీనిని "త్రిపద చంపకబంధము" అను బంధముగా వర్ణచిత్రసహితముగా చూపినారు. ఇట్లు బంధములను వర్ణచిత్రములలో స్ఫుటముగా చూపుట యింతవరకు వాఙ్మయమున లేదు. దీనికాద్యులు గోపాలకృష్ణయ్యగారే. ఇది హృద్యానవద్యము. అయితే వాఙ్మయప్రపంచమున నిదివఱకెవ్వరు రచించని సుమారు 300 విభిన్న బంధాలనిముడ్చుకొన్న విజయశ్రీ శృంగార సగర రచించిన బంధకవితా పారీణులు శ్రీ గోపాలకృష్ణయ్యగారికిది యొక విశేషముకాదు. దీనినిబట్టి మనము గోపాలకృష్ణయ్యగారి కవిత్వమును గూర్చి పరిశోధనచేయుట యావశ్యకమై యున్నది

పూర్వకవులలో గణపవరపు వేంకటకవి "ప్రబంధరాజవిజయ వేంకటేశ్వర విలాసకర్త*" బంధకవిత్వమున ప్రవీణుడు. ఆధునికులలో మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు— ప్రబంధసంబంధ బంధనిబంధన గ్రంథమున బంధలక్షణములు వ్రాసి, "కవితా వినోదకోశము"‡ అను గ్రంథమున వానికి లక్ష్యములు వ్రాసినారు.

బంధకవితను గూర్చి పరిశోధనచేయుటకు పై విషయమెంతయో దోహదమొసగుచున్నది.

తొలిపలుకు పేరునకు తొలిపలుకేగాని యిందు విలువగల విషయములు గ్రహింపదగినవి చాలా గలవు. పాఠకమహాశయులేగాక, వాఙ్మయ చారిత్రక పరిశోధకులు, విమర్శకులు, సావధానముగా మననము చేయుదురుగాక

నిడుదవోలు వెంకటరావు

---

*గ్రంథము తొలిపలుకు 18 వ పుటలో పేర్కొనబడినది.

‡కవితావినోదకోశము — క్రీ. శ. 1933 లో ఆంధ్రకవుల చిత్రపటప్రదర్శనమున - అపూర్వగ్రంథములలో నది ప్రదర్శితమైనది. పార్వతీశ్వరశాస్త్రిగారి పౌత్రులు దానినిచ్చిరి. ఆ గ్రంథము సంపాదింపదగినది. నేనా సభలో పాల్గొన్నవారిలో నొకడను.

౪

మిత్రులు

శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి నమస్సు మీరు విశ్వాసంతో పంపిన శృంగారపదములు-సీతాకల్యాణము అను రెండు పుస్తకాలు చేరినవి ధన్యవాదాలు.

ఇటువంటి గ్రంథాలను ప్రచురించే మీ సంస్థ-ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్-స్వధర్మాన్ని చక్కగా నిర్వహిస్తున్నదని నా హార్దాభివందనాలు తెలుపుకొంటున్నాను

ఈ కార్యానికి మీవంటి మంత్రోత్సాహ సంపన్నులైన పండితులను నిర్దేశిక పదవికి తెచ్చుకోగలగడం కూడా చాలా అభినందనీయమని ప్రత్యేకంగా వ్రాయవలసిన పనిలేదు. మీ నిర్దేశకత్వం క్రింద యీ సంస్థ కొంత నెమ్మదిగా చిరకాలం అనేక సద్గ్రంథాలను ప్రకటిస్తుండగలదని నమ్మినాను

మరి యీ జాబు యింత నిదానంగా వ్రాయడానికి వయోమూలమైన దృష్టి హస్తాల దౌర్బల్యమూ ఇతర కార్యప్రసక్తి కారణాలంతే-దీన్ని ఉదాసీనతగా భావించరని నమ్మి క్షమ నర్థిస్తున్నాను

పై రెండు గ్రంథాలూ మీ ఉపోద్ఘాతాలు నెమ్మదిగా చదివినాను అచ్చు కాయితాలు అందంగా వున్నాయి కానీ అచ్చు చిత్తులను యింకా కొంత శ్రద్ధగా చూచివుంటే బాగుండేది రచనలను గమనిస్తే పై రెండు గ్రంథాలలో తెలుగు సారస్వతంలోని దాక్షిణాత్యశాఖా ధర్మాలన్నీ కానవస్తున్నవి ధారాళమైన, మధురమైన చెక్కుతీర్చిన భాష మునిగితేలేంత శృంగారభావాలు సూక్ష్మమైన లోతైన భావాలు యెన్నో వున్నవి

మీ పీఠికలు మీ అనేక గ్రంథావలోకనపటిమను వెలువరిస్తున్నవి నా అభిప్రాయాలు ఒకటి రెండు విమర్శించితిరి. "మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా" విషయచర్చకు విశ్లేషణం మూలధర్మమే దాని ఆధారంతోనే శాస్త్రాలన్నీ నాటికీ నేటికీ సాగుతున్నాయి కాని విశ్లేషణానికి ప్రస్తార గణితానికీ ప్రయోజన దృష్టిలేకపోతే అవి వట్టి ఆడంబరాలే అవుతాయి అవ్యాప్తి, అతివ్యాప్తి లేని లక్షణం దేనికీ మనం చేయలేము అట్లు చేయవలెనని ప్రయత్నం వాది పరాభవంతో మాత్రమే ముగియవచ్చు. కాని తత్వజ్ఞానానికిగాని లోకవ్యవహారానికిగాని అది ఉపకరించదు కనుకనే తత్వజిజ్ఞాసువులు పెద్దలెందరో తర్కాన్ని తిరస్కరించినారు ఈ దృష్టితోనే నేను "పద" శబ్దాన్ని చర్చించి ఉపయోగించింది కృతి, కీర్తన, వర్ణం, జావళి మొదలైన శబ్దాలన్నీ వ్యవహార దృష్టితో ఏర్పడిన పారిభాషికపదాలు, వాటి వ్యుత్పత్తి చరిత్ర మొదలైన చర్చావిషయాలు కొంతవరకూ వినోదంగా మాత్రమే ఉండగలవు.

'శృంగారపదములు' పీఠిక XX పుటలో మీరు శార్ఙ్గదేవుని మతాన్ని విమర్శించడం అతడు 'గుహ్యాద్గుహ్యతరమైన పద్ధతిలో' ప్రబంధాధ్యాయాన్ని రచించలేదని చెప్పడమూ సరిఅయినదే-సంగీత ప్రబంధాల ప్రస్తారం అతడు చేసిందే వాడుకలోకిరాక చాలాభాగం అంతరించిపోయింది ఇంకా ఎక్కువగా ప్రబంధాలను విశ్లేషించి ప్రస్తరించివుంటే వాటి సంఖ్య, మీ రిచ్చిన సమార్ధసమ విషమ వృత్తాల 19 అంకెల సంఖ్యవలెనే, వట్టి అబ్బురపు పనిగా పరిణమించి, అసలు గ్రంధమే అంతరించిపోయి వుండేదేమో. మీ పరిశ్రమకు సంతోషిస్తా. హార్దికంగా మీ అభ్యుదయాన్ని కోరే మిత్రుడు.

భవదీయుడు

జయనగరం, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

బెంగుళూరు

---